# నాటికాసర్వము

చలం



# సంకీర్తన గుచ్ఛము

[ ఇతర నాటికలు ]

చలం



దేశి కవితా మండలి
విజయవాడ-2

దేశీ ప్రచురణ
ప్రథమ ముద్రణ '58
వెల: రెండురూపాయలు
దేశీప్రెస్, విజయవాడ-2



సంపాదకులు
బొందలపాటి శకుంతలాదేవి
శివరామకృష్ణ

ఇందులో :

# మృత్యువు

## ఒకటో రంగం:

చచ్చిపోయిన వాళ్ళు తేలేలోకం. పెద్ద మైదానం. మెత్తని కాంతి సుందరంగా ప్రదేశాన్ని నింపుతోంది. ఆహ్లాదకరమైన గాలి మెల్లిగా, అనేక పరిమళాలతో వీస్తోంది. ప్రపంచంలోని అన్ని జాతులవారూ గుంపులు గుంపులుగా వెడుతున్నారు. ఒక దేశస్తులూ భాషస్తులూ గుర్తించుకుని దగ్గిరికి చేరుకుంటున్నారు. అందరి మొహాలూ శాంతంగా ఆనందంగా వున్నాయి. ఆగాలిని పీలవడం వల్లనే, ఆ కాంతిని చూడడంవల్లనే నూతనోత్సాహమూ, జ్ఞానమూ కలుగుతున్నట్టుగా వుంది.

కాంతయ్య చాలా ముసలివాడు.

కాంతయ్య: ఏం నవ్వుతావు? ముసలివాణ్ణి అనా? నడు నాతో చూద్దాం.

ప్రసాదరావు కుర్రాడు.

ప్రసాదరావు: కాదయ్యా, తాతా, వాడెవడో అదేదో భాషలో పలకరిస్తున్నాడు నన్ను.

కాంత: చూడు, నిన్న మనిషిపట్టుకు లేవతీశాడు నన్ను. బతకనన్నారు. కాని ఆశరభయ్య చివరమాత్ర అది ఒకటి గొంతులో వేశాడు. చూడు పిడుగులాగు ఎట్లా ఐనానో!

చిట్టెమ్మ వితంతువు.

చిట్టెమ్మ: ఏమండోయ్! తెలుగు మాట్లాడుతున్నారు. చూడండి, మావాణ్ణి చూశారా, శీతయ్యని! వాడూ

నేనూ కాశీకి బైలుదేరాం. దోవలో నాకు కలరా తగిలింది. కాశీ విశ్వేశ్వరుడికి, నాకు దర్శనమివ్వాలని వుంది గావును, ఆయన దయవల్ల బతికాను. భక్త పరాధీనుడు!" కాని మావాడు కనపడడు కద! బాబూ మీరు కాశీకేనా?

కాంత: (వుత్సాహంగా) కానీ, కాశీకే పోదాం! ఎక్కడికైతే నేం?

సుశీల పసిపిల్ల-అటూఇటూ పరుగెత్తుతోంది.

సుశీల: అమ్మ, మంచి అప్పచ్చి పెత్తింది. మందు చేదు. వొద్దు అమ్మా! నాకు వువ్వాయిపోయింది. చూాలూా. (నవ్వుతోంది) అమ్మేదీ? (వింటూ) ఆ. ఆ. అమ్మ. అమ్మ. పిలుత్తోంది, అమ్మా. ఇత్తాలా.

చిట్టె: ఎంత ధైర్యమో ఆపిల్లకి!

ఇంగ్లీషు ఆమె వొచ్చింది.

ఇంగ్లీషు ఆమె: Where is my baby? The tiny one should be crying. It is time for her feed. Where am I?... They don't allow me to feed her, I was so ill little cuddles, Hallo, Nellie, you! you!

సుశీల: అమ్మా! అమ్మా!

ఇంగ్లీ: You call me, darling, my own.

కాంత: అదేమిటి ఆపిల్లని ముద్దాడుతోంది?

చిట్టె: పిచ్చిది.

చిట్టెమ్మ బిగ్గిరిగా మంత్రాలు చదువుతోంది. చల్లయ్య వొచ్చాడు.

చల్లయ్య: అమ్మో! శుభ్రమైన తెలుగుముక్కలు చెవిని పడు తున్నాయి యిక్కడ. ఏమిటీ మాలలోకం, ఇట్లా బైలు దేరింది, చీమలపుట్టలాగు! కానూరు వొక్కణ్ణే బైలుదేరితే ప్రపంచమంతా నా వెంట పడ్డదేమిటి? తోవలో పాము కాటేసింది, బారెడుతాచు. చచ్చా ననుకున్నా. కాని ఇనపముండా వాణ్ని పాముకాటు లెఖ్ఖా నాకు! నాజాతకంలో యెనభై యేళ్ళు ఆయు ర్దాయం. నేను చస్తానా?... వీళ్ళు తాగుతా రేమో కద! సంధ్య వారుద్దామంటే నీళ్ళు కనపడవు. ఎన్నో వాగులుండాలి దోవలో. తోవ తప్పలేదు కద!

మార్వాడీ జమన్‌లాల్ వొచ్చాడు.

జమన్‌లాల్: చచ్చేముందు దాన ధర్మాలు చెయ్యండి. నిన్న చావు దగ్గిరికి వొచ్చిందనిపించింది. తెల్లారిందాకా బతికానా, ఆరువేలు దానమిద్దా మనుకున్నాను. ఎందుకండీ పాడుడబ్బు! చచ్చేప్పుడు వెంట తీసుకు పోతామండీ! ఇండండి తీసుకోండి. వొద్దా! అరే! దేఖో భాయ్. ఈ దేశంలో చలామణి కావుగావును.

వస్తాదు సులేమాన్ వచ్చాడు.

సులేమాన్: పదిమంది కలిసి పొడిచి, చచ్చానని గోతిలో తోశార్- చచ్చాన్రా! సులేమాన్, చావడు, చావ లేదు, చావడు. ఒరే పోలిరెడ్డీ, ఇంక నీ పెళ్ళాన్ని యెట్లా దాచుకుంటావో చూస్తాను. అది మంచి మని షండీ! నన్ను నరుకుతారని చెప్పి ఏం యేడ్చింది, యేం యేడ్చింది!

చల్ల : సాహెబుగారూ, యేవూరండీ మీది!

సులే : మాది యేలూరు; దాన్ని యేం చేశారో పాపం! బలేమనిషి పడుకుందంటే- ఏం బోగాలండీ! కండ కావరంతో తిరుగుతామన్న మాటేగాని- నన్ను పొడిచి చంపేశారు. కాదు. పొడిచారు యీ వెన్నులో. ఏదీ లేదే! పొడిచారనుకున్నాను.

రాజన్న రాజకీయఖైదీ.

రాజన్న: ఎక్కడికండీ పోతున్నారు మీరంతా! నాలుగేళ్ళయింది మా అబ్బాయిని చూసి, ఎక్కడో వుండాలి యీ గుంపులో.

జమన్: ఏమండీ, రాజన్నగారూ, ఎప్పుడు వొదిలారు జైలులోంచి మిమ్మల్ని! మీ కేదో క్షయ అన్నారు!

రాజ : అవును. మొన్ననే యెక్కువ చేసింది. అందుకనే వొదిలినట్టున్నారు. నేనెక్కడ చస్తానులెండి! మొదటినించీ నాకు ధైర్యమే. భరతమాతకు నేను అవసరం. దేశసేవకై యీశ్వరుడు నన్ను మిగులుస్తాడని తెలుసు. ఆ రాముడిలో విశ్వాసమున్న వాళ్ళని చెరచరండీ.

కృపానిధి-కుర్రకవి, వొచ్చాడు.

కృపానిధి: ఆహా, యెంత రమ్యంగా వుంది. అయ్యా, మీ దగ్గిర కాయితమూ కలమూ వుందా! ఒక్క ప్రేమ గీతం వొస్తోంది, ఆ పారసీ ఆమెని చూస్తే. భారతి! పంపాలి, నన్ను మీరెరగరూ! అవును లెండి, కవుల!

కీర్తి వొచ్చేకాలమూ, దేశమా? కాని వుండండి కొద్ది సంవత్సరాలలో వింటారు నాపేరు.

లక్ష్మీ యప్పారావు వొచ్చాడు.

లక్ష్మీయప్పారావు: అరే మీాదికి తోసుకొస్తారేం? ఒరే, పీరన్నా! ఎవరూ లేరు. కొంచెం ఎక్కువ జబ్బు చేసేటప్పటికి ఎవరితోవన వాళ్ళు పోయినారు. ఇంతే కదా అధికారమూ, ఐశ్వర్యమూ!

గుడ్డివాడు, ముష్టివాడు వొచ్చాడు.

ముష్టివాడు: అయ్యా, గుడ్డివాణ్ణి, అవిటివాణ్ణి, ఒక్క కానీ యివ్వండి. అమ్మా, నువ్వన్నా కనికరించు.

చిట్టి: ఒరే, నేను కనపడగాలేంది గుడ్డి యేమిట్రా నీకు? ఎవడురా నువ్వు-అట్లా పైకి వొస్తావు?

ముష్టి: నిజమేనమ్మా, కనపడుతున్నావు. పోనీలే ఆకలవుతోంది. ఒక ... ఆకలికూడా లేదే. ఇరవైనాలుగు గంటలు ఆకలితో చచ్చేవాణ్ని-

వెంకటచలం రిఫార్మరూ, సీతమ్మ యవ్వను రాలూ వొచ్చారు. ఆమె బాలవితంతువు.

వెంకటచలం: అమ్మా, ఇంకా చిన్నవయసు. ఎంతకాలం వొంటరిగా బతుకుతావు? చక్కని వరుడు వున్నాడు. మీావాళ్ళకి తెలీకముందు వెంటనే యిప్పుడే పెళ్ళి చేస్తాను, నీకు. ఏమీా తప్పని సంకోచించకు. ఈ ముసలివాళ్ళు చెప్పేవన్నీ నిజమనుకోకు.

సీతమ్మ: పెళ్లా? ఎందుకు? చూడండి, ఎంత రమ్యంగా వున్నదో యిక్కడ? హాయిగా ఆడుకుంటాను.

వెంక : ఇప్పుడట్లానే వుంటుంది. కాని ఇంక నాలుగేళ్ళు పోతే నీ శరీరం వూరుకుంటుందా? నీకేం కష్టం లేదు. ఇంతవరకు నేను నలభైతొమ్మిది పెళ్ళిళ్లు చేయించాను.

సీత : శరీరమా? నాకు తెలీటంలేదు. నమస్కారం, వెళ్ళండి.

శంకర్రావు-స్కౌట్, వొచ్చాడు.

వెంక : ఏమిటబ్బా, ఇందరు మొగవాళ్ళు - ఆడవాళ్ళు వున్నారు. ఒకరివంక ఒకరు చూసుకోరు. తమాషాగా వుంది. నే నేం రిఫారం చెయ్యను?

శంకర్రావు: ఇదేమి తిరనాళండీ! మా స్కౌట్లు ఇంకెవరూ రాలేదా? ఎవరికన్నా సహాయం కావాలా? ముసలి వాళ్ళకి, బీదవాళ్ళకి, కుంటివాళ్ళకి— ఎవరికీవొద్దా? ఇక్కడ యెవరికీ సహాయం అక్కర్లేనట్లుందే!

సినీమా స్టార్- వనజాక్షి వొచ్చింది.

శంక : మీ కేమైనా సహాయం కావాలా?

వనజాక్షి: నాకా? నాకేంకావాలి? నేనేం సాధారణండాన్ని అనుకుంటున్నట్టున్నావు. (బిగ్గరిగా) నేను సినీమా Fame వనజాక్షిని.

అందరూ తనవంక చూస్తారనే ఆవేశంతో చుట్టూచూస్తోంది.

ఇదేం దేశం! ఇంత మూర్ఖుల్ని నేను చూడలేదు. నాపేరే విన్నట్టులేరే! వీళ్ళు పశువుల్లాగ వున్నారు. ఆడదాన్ని యిట్లా రాసుకు పోతారేం? కళ్ళు పోయినాయి. అందాన్ని గుర్తించరే! ఇంతగుంపులో నాకు వూపిరి తిరగటంలేదు. ఎప్పుడో ఓ స్వయంవరం సీనులోతప్ప యింతగుంపులో నేను నుంచో లేదు. మోటారు అలవాటై నడవడమే మరిచిపోయి నాను— మా డైరక్టర్ వుంటేనా? ఈగుంపునంతా పీల్మ్ తీసును.

సూర్యనారాయణ-మందులమ్మేవాడు వస్తాడు.

సూర్యనారాయణ: ఇదుగోనండి — వినండి — ఈమందు వుందే, ఇది సులేమాన్ యోగిగారు హిమాలయ పర్వతాల్లో కనిపెట్టినారు. ఇది తల నొప్పులకు—

అందరూ నవ్వుతున్నారు. సిగ్గుపడిపూరుకున్నాడు.

ముసలివాడు కాంతయ్య—వేదాంతి—వొచ్చాడు.

కాంత: తొందరగారండి. ఉట్లా దిక్కులుచూస్తారేం?

సూర్య: ఎక్కడికి వెడుతున్నాము, మనమంతా?

కాంత: చూద్దుగాని రా, ఎక్కడికి వెడితేనేం? బతికి వున్నన్నాళ్ళూ అడగలేదేం ఆ ప్రశ్న? తీరా చివరికి వొచ్చి యిప్పుడడుగుతున్నావు?

వన: బతికి వున్నన్నాళ్ళూనా? ఇప్పుడేమిటి - చచ్చామంటావా!

కాంతయ్య నవ్వుతున్నాడు. చుట్టూ ప్రతి
వాడు బిక్కమొహం వేసి ఆలోచిస్తున్నాడు.

సులే : సులేమాన్ చచ్చాననంటావు రా! తంతాను.

కాంతయ్య నవ్వుతున్నాడు.

కాంత: తన్నులు తన్నే కాలం అయిపోయింది. తినేచోటికి వొచ్చాం.

చిట్టి : మనని యేంచేస్తారు?

సూర్య: యముడిదగ్గిరికి తీసుకుపోతారు.

వెంకట: ఏమిటిరి? యమలోకంవుందీ? అంతా అబద్ధమన్నారు!

మోసెస్ వొచ్చాడు.

మోసెస్: లేదు. ఇక్కడేవుండాలి, డూమ్సుడేవరకు. అప్పుడూ నరకం మీ అందరికీ. నేనుబోధించినప్పుడు నవ్వారు. చూడండి ఇదంతా బైబిల్లో చెప్పినట్లు వుందిసరిగ్గా. ఇప్పుడన్నా తెలిసి వొచ్చిందా? ఏరీ మీ యమ భటులు?

చల్లయ్య: ఒరే గోహత్యలు చేసినవాడికి నీకు స్వర్గ మెవ డిస్తాడురా?

సులే : ఏమిటి? గోహత్య యేమిట్రా, బ్రాహ్మడా! రేపు అల్లా నీ పిలకపట్టుకు జాడించినపుడు తెలుస్తుంది.

చల్ల : నేను గంగా స్నానం చేశాను, నా పాపాలన్నీ పోయి నాయి.

చిట్టి : అయ్యా, శాస్త్రుల్లగారూ, నిజమేనా? నేను గంగా స్నానం చెయ్యలేదు గోదావరి కాలవలో మునిగానండీ! అదీ దక్షిణగంగ అంటారు కదా!

చల్ల : లాభంలేదు. ఏదో కొంతవరకు ఆలోచిస్తారు నీసంగతి.

సుతే : నాకేంభయం లేదు, ప్రతిరోజూ నమాజ్ చేశాను.

మోసెస్: నేను పశ్చాత్తాప పడ్డాను.

దాసరి వెంకయ్య వొచ్చాడు; పాడుతున్నాడు.

వెంకయ్య:

ఇల్లు వాకిలి నాది, ఇల్లాలునాదనుచు
ఏల భ్రమసెదవు, మనసా!
కాలునీ వలలోన కానకను చిక్కితివి
కడతేరుటే తోవ మనసా!

అయ్యా, ఏమీ శాశ్వతం కాదు. ఒక్క కానీ ధర్మం చెయ్యండి, నేడో రేపో అందరూ చచ్చేవారే. ఈ నాలుగు రోజులే మీ ప్రభ!

•••——•••

# రెండో రంగం

పర లోకం.

పెద్ద మైదానం మధ్య ఒక స్వరూపము, మబ్బులువేసినట్టు ఉన్న తంగా వుంది, పీఠము కాబోలు. ఆ రూపము అనేక రంగులతో తేజస్సులతో మిరుమిట్లు గొలుపుతోంది. గంభీరమూ, భయోత్పాద కమూ ఐన అనేక గాఢభావాలను ప్రేరేపిస్తుంది. దేశ, కాల, జాతి లింగ భేదాలకు అతీతమయింది, రూపం నిర్ణయంగా యేర్పడక, మబ్బువలె మారుతోవుంటుంది. చూసేవారినిబట్టి పరిపరివిధాలతోస్తుంది. వేనకువేలు స్త్రీ పురుషులు అన్నిజాతులవారూ, దీపముచేత ఆకర్షింపబడ్డ పురుగులవలె ఆ జ్యోతిచుట్టూ చేరుతున్నారు. ఆయన దృష్టి యెవరిమీద నిలిస్తే వాళ్ళు ముందుకివొచ్చి యెదట నిలబడతారు. ఒక్క చూపుతో ఆ వ్యక్తి అంతరాంతర రహస్యాలన్నీ ఆయనకు అర్థమైనట్టు తోస్తుంది. అప్పుడప్పుడు గుంపులోనించి కొందరు వాళ్ళనమ్మకాల ప్రకారం, జీసస్, అల్లా, నారాయణ, అని కేకలువేస్తారు. స్తోత్రాలు చదువుతారు.

ఆయన్ని అధికారి అని పిలుద్దాం

పోలీసు సుబ్బన్న వొచ్చాడు. కుక్కపిల్ల వలె వెల్లకితలా పడి వొణుకుతున్నాడు.

సుబ్బన్న: పాపిని, ఈశ్వరా, పాపిని, హరీ, నేను పాపిని, నన్ను నరకంలో తొయ్యకు, నాకు బుద్ధివొచ్చింది. ఎన్నటికీ బాధించను. లంచాలు తీసుకున్నాను. అదుగో, కరుణమ్మ! దాన్ని చెరిచి, పైగా ఖైదులో వేయించిదాని పిల్లల్ని తరిమి — తెలీక చేశాను.

అధి : అవును. అణుచుకోలేని కామం, అర్థంలేని క్రూరత్వం, ఉపయోగం లేని ధనకాంక్ష — తెలీకపోవడంకాదు.

సుబ్బ: రామనామం జపంచేస్తే పాపాలన్నీ పోతాయన్నారు. పోవు.

అధి : నీకు మళ్ళీ జన్మనిస్తాను.

సుబ్బ: నన్ను పందిని, కుష్టుని చెయ్యండి.

అధి : (నవ్వి) ఇట్లారా; అట్లా కుంగిపోకు. ఏమి? పాపాలు చేస్తేనేమి? అవి శాశ్వతంకావు. నీ ఆత్మ జయించి తీరుతుంది. భయపడకు. నీ ఆశలన్ని కోరుకో.

సుబ్బ: తమకు ఆగ్రహం కలుగుతుందేమో!

అధి : భయపడకు. ఈశ్వరుడు కరుణామయుడు, నాకు తెలుసు నీ కోర్కెలు. మీ సూపరెంటు భార్యవంటి సౌందర్యవతి, అధికారం, గొప్ప జీతం—

సుబ్బ: అవును. అవును,

అధి : పెద్ద మిలిటరీ అధికారివవుతావు. ధనము. స్త్రీలు— కరుణమ్మ తన సౌందర్యంతో నీ హృదయాన్ని నలిపి చీల్చి పాఠాలు నేర్పుతుంది.

సుబ్బ: అనుగ్రహం.

ముసలి సన్యాసి.

అధి : ఇంకా పూర్తికాలేదు నీ యోగసాధన, త్వరపడ్డావు.

సన్యా: అవును.

అధి : సిద్ధిపొందావని శిష్యులంటే నీవూ నమ్మావు.

సన్యా: అవును. ఏకాగ్రచిత్తమువల్ల నా నరాలలో పుట్టిన ఆనందాన్నీ, ప్రజల మనశ్శరీరాలమీాద నాకు కలిగిన శక్తినీ, నామూలాన వ్యాధులకూ, కోర్కెలకూ

విదూరులైన పామరుల స్తోత్రాలనూ చూసి మోస పోయి అద్వైత సిద్ధిని పొందాననుకున్నాను.

అధి : ఈజన్మలో బాల్యమందే యోగమార్గంలో పడతావు. ఇంకా దీర్ఘసంస్కారం కావాలి నీకు.

సన్యా: ఒక్క ప్రార్థన: ప్రజల నించి, వాళ్ళ యాచననించి, కృతజ్ఞతనించి తప్పించండి. ఎవరూలేనిద్వీపంలో —

అధి : లోకాభిప్రాయాలను మన్నించావు. నీఆత్మస్వేచ్ఛను వాళ్ళ గౌరవంకోసం బంధించావు. వాళ్ళ గౌర వాన్ని అతిక్రమింపగల వివేక సాధనకే నిన్ను పంపు తోంది. లోకాన్ని ప్రేమించు. కాని లోకంచేత బంధింపబడకు.

చంటిపిల్ల వచ్చింది.—సుసీల.

సుసీ : అమ్మ. అమ్మ.

అధి : రా.

సుసీ : అమ్మా, నువ్వ, అమ్మ, (ఆయన వొళ్ళో దూకింది. ఆయన్ని కావిలించుకుని, ఆనందంతో 'అమ్మఅమ్మ' అంటోంది.)

అధి : అమ్మకావాలి కాదా? నీఅమ్మ మూర్ఖురాలు, పిల్లని పెంచడం తెలీక, నిన్ను చంపుకుని ఏడుస్తోంది నీకోసం; ఎక్కడ వున్నావా అని చూస్తోంది, ఆకాశంకేసి. వెళ్ళు నలుగురమ్మల చేతుల్లో అతి గారాబంగా పెరుగు–దీర్ఘాయుష్మంతురాలవై, మళ్ళీ రా—

సాలమన్ - మిషనరీ.

సాలమన్:- జీసస్ ఏరీ ?

అధి : ఏమిషని?

సాల : స్వర్గమిస్తాడు. మీారెవరో మీాతో పనిలేదు.

అధి : నేనే జీసస్.

సాల : నా పాపాలకి పశ్చాత్తాపపడ్డాను.

అధి : మరి మీావదిన గారి ఆస్థిని యిచ్చేశావా?

సాల : పశ్చాత్తాప— అవును తప్పే, నా జీవిత మంతా నీ నామం ప్రచారంచేశాను.

అధి : నీవు తీసుకున్న జీతమో! పైగా స్వర్గమా?

సాల : మరి బైబిలులో—

అధి : బైబిలులో నీకున్న దంతా బీదలకు పంచమన్నారు.

సాల : అదిసాధ్యమా? నాకుటుంబమూ—

అధి : బైబెలులో నీకు సాధ్యమైన వాక్యాలు మాత్రమే నమ్మ్రతావా? జీసస్ ఉద్దేశాలు అనుష్టించడం అట్లా ఉంచి, అర్థం చేసుకునేందుకు, నీకింకా ఎన్నిజన్మలో అవుసరం — జ్ఞానం సంపాదించుకో ఇంగ్లండులో పుట్టు— బైబులుకి వ్యాఖ్యానం రాస్తావు. వెళ్ళు.

సాల : నేను నాజీవితమంతా పరోపకారంలో గడిపాను.

అధి : (నవ్వి) పరోపకారం చేసినవాడికి ఆసంగతే జ్ఞప్తిలో వుండదు-ఆలోచించుకో.

నరిసింహారావు నాయుడు—మహాదాత

నరిసింహారావు:- స్వర్గమే యిస్తారో, ఇంద్రత్వమే యిప్పిస్తారో మరి.

అధి : స్వర్గమూ, ఇంద్రలోకమూ—అంటే?

నరి : మీాకే తెలీదా? మరి వేదాలలో పురాణాలలో చెప్పారే!

అధి : ఎవరు?

నరి : ఈశ్వరుడు వ్రాశాడన్నారు.

అధి : ఎవరు?

నరి : ప్రజలందరూ.

అధి : నమ్మి— దానధర్మాలు అమితంగా చేశావు పాపం.

నరి : నాకీర్తి భూలోకంలో ఎంతకాలం వుంటుందో, అంత కాలం స్వర్గమనుభవిస్తా నన్నారు... మరి స్వర్గమే లేకపోతే, అంత ధనాన్ని వ్యయం చేశాను. ఫలిత మేమిటి? మోసం!

అధి : స్వర్గమే యిస్తాను నీకు

నరి : లేదన్నారుగద !

అధి : కల్పిస్తాను. ఎట్లావుండాలి నీకు స్వర్గము?

నరి : అప్సరసలు, హార్మ్యాలు— ఉద్యానవనాలు.

అధి : భూలోకంలో లేవా? ఐశ్వర్యవంతుడివి నీకేమితక్కువ?

నరి : నా ధనంఖర్చుచేశా?

అధి : ఇక్కడ ఏవ్యయం లేకుండా దొరుకుతాయని దానం చేశావు.

నరి : కాని శాశ్వతంగా కావాలి, మృత్యువూ ముదిమీా అభ్యంతర పరచకండా—

అధి : నీవు అప్సరసలనూ, హార్మ్యాలనూ అనుభవించి వుంటే తెలిసేది నీకు— వాటి క్షుద్రత్వము.

నరి : పోనీ, నేనుఎన్ని వేలప్రాణులకు ఆనందం కల్పించాను! నిరతాన్నదానం... నా మూలాన ఎన్ని ప్రాణులు-

అధి : నీవేనా, లోకాలలో ప్రాణుల్ని పోషించేది? నీకు ప్రేమ వుండే పోషించావా? నీయింటి పక్కన గజ్జి కుక్క అన్నంలేక చచ్చింది జ్ఞాపక ముందా? గో రక్షణసభా! ఆ ముసలి గోవుల్ని చచ్చిపోనీక, చంపక, ఆరోగాలతో ఎందుకు జీవితం పెంచావు? భూతదయా? నీ యింటో ఎలుకల్ని బోనులో నడుం విరిచి, తెల్లవార్లూ మరణ వేదన పెట్టావు. అనాథవై పుట్టి ప్రేమకి అర్థం తెలుసుకో. అన్నంలేక మల మల మాడి, దానముయొక్క విలువ నేర్చుకో.

ముసలివాడు-కాంతయ్య.

అధి : నీకింక కావలిసింది ఏముంది? శుక్రుడిలో జన్మించు.

కాంత: నాకింక ఈనాట్యము చాలు. నాకుముక్తి నివ్వండి.

అధి : ముక్తి! దేనినించి!

కాంత: జీవితమునించి – ఈ జనన మరణాదులనించి.

అధి : ఎందుకు ?

కాంత: నీ కెరగవా ? అలిసిపోయినాను. విరక్తి కలిగింది.

అధి : నీ విరక్తిని మాన్చడానికే శుక్ర లోకానికి పంపుతున్నాను. జన్మల తరవాత జన్మలెత్తి సమస్తమూ అనుభవించి విరక్తిపొందావు భూలోకంలో. శుక్రుడు

నీకు క్రొత్త యింద్రియాలను, క్రొత్త కాంతుల్ని, కొత్త కోర్కెల్ని, కొత్త ఆశల్ని, బాధల్ని కల్పి స్తాడు.

కాంత: వొద్దు, నాకే ఆశా లేదు.

అధి : ఎందుకా విరక్తి ? విరక్తే మృత్యువు. ఎందుకు నీ యింద్రియాల్ని కట్టుకుని ఏదో ఆనందాన్ని, యీశ్వ రుణ్ణి పొందాలనుకుంటావు. ఈ రసాలు, భోగాలు, దృశ్యాలు అన్నీ యీశ్వరుడు నిన్ను రమ్మనేఆహ్వ నాలు. సృష్టి అంతా నిండి సౌందర్యంలో నాట్యం చేసే యీశ్వరుణ్ణి తృణీకరించి నీవు ముక్తిని పొందు తావా ? నీ కెందుకా తొందర?

భూలోకాన నీకు విరక్తి జనించి నంత మాత్రాన యీశ్వరసృష్టి కొల్లబోలేదు. అనంతంగానూతన్నంగా ఏర్పడే యీసౌందర్య ఐశ్వర్య ఆనందాలన్నిటికి అధి పతివి. నీ వా లోకంలో పొందిన జ్ఞానం సూదిమొన కన్న యెక్కువ లేదు. గర్వపడకు. వినమ్రుడవై యీ సర్వ లోకాలనూ జన్మించి అనుభవించు. కామరూపివై ఆనంద లోకాల స్వచ్ఛంద విహారంలో గడుపు. ప్రేమించు. మధురమైన జీవితాన్ని. నీ శరీ రమూ, కాలమూ యివ్వగల ఆనందాన్ని ప్రేమించు.

కాంత: మరి యీశ్వరుడిలో లీనం కావడం ఎప్పుడు ?

అధి : ఇప్పుడు లీనంగాక వేరే వున్నావా ?

కాంత: మరి నేను వేరుకాదా ?

అధి : వేరైన వాడివి ఎక మెట్లా అవుతావు-యీశ్వరుడివే ఐతే కాసి? వెర్రి వేదాంతుల పలుకులు మరిచిపో.

శాంత.

శాంత: నీవు పిశాచివి. ఎందుకు చంపావు నన్ను! నీకాళ్ళు పట్టుకుంటాను. నన్ను మళ్ళీ పంపు. నేను భరించలేను యీ వియోగాన్ని.

అధి : పాపం! ఏంచెయ్యను?

శాం : ఏం చెయ్యను? ఏం చెయ్యలేవా? చంపడం తెలుసును. ప్రేమ మూర్తిట! ఏమీ ప్రేమ మూర్తివి కావు.

అధి : కాను.

శాం : మరి అన్నారే!

అధి : ఇతరుల మాటలు ఎందుకు నమ్మావు? నమ్మకు. నీ అనుభవం మీదనే ఆధారపడు.

శాం : నీవు ప్రేమ మూర్తివి కావా!

అధి : నామాటలో మాత్రం నీకు విశ్వాస మెందుకు? నీవే యోచించుకో.

శాం : నీవు రాక్షసివి ఏమి?

అధి : అవును.

శాం : నేనూ రాఘవయ్యా అంతగాఢంగా ప్రేమించుకున్న తర్వాత విడతియ్యటానికి నీకు చేతులెట్లా వచ్చాయి?

అధి : కరుణవల్ల — ప్రేమలో విషాదము విరహంవల్ల రాదు. ప్రేమ పాతదై మామూలై ప్రియులు ఒకరి నొకరు ద్వేషించుకోవడంలో వుంది విషాదము. ఆ

మరణంనుంచి తప్పించాను నిన్ను. సుకుమారమైన నీహృదయాన్ని రక్షించాను, ఆ అంధకారం నుంచి. ఇంకొకటి. ప్రేమలో మైమరచి నీ దేహయంత్రాన్ని నిర్లక్ష్యంచేస్తే ఎన్నాళ్ళు పని చేస్తుంది?

శాంత: ఏమిటీ, ఏనాశనాన్నీ ఎరగని శరీరాన్ని వ్వకూడదా, మానవులకు?

అధి : ఇవన వరాలనిస్తే నీప్రియుడి మృదు స్పర్శలకు ఎట్లా కంపిస్తాయి? ప్రియుడి ప్రేమకన్న విశాల మైనది మాతృప్రేమ. ఈజన్మలో దాన్ని కటాక్షిస్తున్నాను వెళ్ళు.

రామారావు.

అధి : నీకు అనూరాధలో జన్మ, వెళ్ళు.

రామా: ఇక్కడ యీమూలనే నుంచోనీండి. ఇట్లాంటి సౌందర్యం నేను చూడలేదు.

అధి : అప్పుడే భరించలేవు. అనూరాధలో శిక్షణను పొందాలి ముందు.

రామా: ఏమిశిక్షణ నాకు! ఎందుకు నా కాజన్మ? నా గాఢ వాంఛ, నానిరాశ, నాతీవ్రమైన వేదన తెలుసునా మీకు? ప్రతి నిముషమూ మారే సౌందర్యాన్ని, సంధ్యను, పుష్పాన్నీ, జరామరణాల్లో ప్రవహించే యవ్వనసౌందర్యాన్ని, మాయం కాకుండా జారిపోకండా, మారిపోకండా, నా కుంచెతో బంధించాలని ప్రయత్నించాను. నన్నెందుకు తీసుకొచ్చారు?

అధి : తృప్తి కలిగిందా?

రామా: రంగులా! నావూహాలో వున్న సౌందర్యానికి ఆ ఏడు రంగులూ, ఆ మూడు వొంపులూ చాలలేదు. చూడండి. మీకన్నా అర్థ మౌతుందా, నామనో దృష్టిలో వున్న పటము? మీ రేనా సృష్టికర్త? నదీ జలంమీద అస్తమయ కిరణాలు పడేప్పటి రంగుల మిశ్రమం, అర్ధరాత్రి చంద్ర కిరణాలు అలల మీద కదిలేప్పటి చంచల మృదుత్వం, ప్రేమతో కళ్ళు వోరగాపెట్టి ప్రియుడివంక చూసే కన్యదృష్టులలోని కోమలభావం, చిన్నపిల్ల పరిగెత్తేప్పటి తొడలచిన్ని మెరుగులు- ఏరంగులు చిత్రించ గలవు? ఏ గీతాలు వ్యక్తపరుస్తాయి? పటం మొద్దులాగు కదలక కూచుంటుంది, జరగాలి, పరుగెత్తాలి. విస్తీర్ణాన్ని కాదు, కాలాన్ని చూపాలి. ఎంతసౌందర్యం! ప్రజలుకన్నెత్తి చూడని, చూసినా అర్థంచేసుకోని అనుభవించని సౌందర్యాన్ని- అమూల్యమైన సౌందర్యాన్ని అట్లా, అంత చవకగా వొలక పోశారు! నిప్పుశిఖల వంటి వేళ్ళతో వంటచేయిస్తున్నారు. పువ్వుకన్న కోమల మైన హృదయాలను వెక్కిరింపు మాటలతో చీలుస్తున్నారు. వజ్రాన్ని పశువులమెళ్ళో అలంకరించారు. మీకు నిర్లక్ష్యం, తృణీకారం. చిన్న మొగ్గగా వున్న పుష్పాంచి చిన్ని రేకులమీద చిత్రించిన వర్ణాలు, అడివిలో సముద్ర మధ్యాన్ని చిన్ని గుల్లలోపలి పొదిగిన రేఖ—ఎందుకు అట్లా?

అధి : సంవత్సరం చిత్రించిన పఠాన్ని, తృప్తిలేక మూల పడవెయ్యలేదా నీవు? అట్లానే ఆచిత్రించే ఆనందమే బహుమానం. ఇతరులు అర్థం చేసుకోగలరని ఆశ.

రామా: తప్పుఅర్థం తీసినప్పుడో! అర్థంకాక, సౌందర్యం చూడక, 'బావుంది' అని తల వూపినప్పుడో! నాకెందు కీబాధ! సౌందర్యలేశం నాదృష్టిని పడగానే, నాస్వంతమైనట్టు, నా ఆత్మబంధం ఏదో నాశనమై పోతున్నట్టు నాకెందుకీ వేదన!

అధి : సౌందర్యాల సృష్టికర్తకి పుత్రుడివి కనుక ఆ సౌందర్యానికంతా అధిపతివి నీవు.

రామా: తక్కిన ప్రజలు ?

అధి : ఇంకా ఆసంస్కారం కలగలేదు. అంతవరకు ధ్వంసం చేస్తారు— పసిపిల్లలు తమ వస్తువులను విరుగగొట్టుకున్నట్టు.

అనూరాధలో నీవు వూహింపలేని వర్ణాలు, ఆరువైపులకు జారేరేఖలు. వైశాల్యమూ కాలమూ ఏకమయ్యే ఔన్నత్యము—యీ రంగులకూ రేఖలకూ వెనకవుండే లావణ్యభావం బోధించగల గురువులు—నీఆత్మకి పురోభివృద్ధి అక్కడా—

రామమ్మ.

రామ: స్వర్గమెక్కడ! నేను పతివ్రతను.

అధి : నీపతి నరకంలో వున్నాడు.

రామ: ఆయన ఖర్మం, పాపాలు చేశాడు...అయినా ఆమరణాంతమేకదా పాతివ్రత్యం?

అధి : నా వంక చూడు; నీ భర్తను ప్రేమించావా?

రామ: ( ఆత్మలో చూసుకుంటూ అప్రయత్నంగా ) ఎట్లా ప్రేమించను అట్లాంటిదుర్మార్గుణ్ణి! కాని సేవించాను. పతివ్రత ననే కీర్తిని పొందాను.

అధి : సరే. అటువంటిదుర్మార్గుణ్ణి సేవించిన నీచత్వానికి పరిహారం కావాలి.

రామమ్మ : మరి నేనుచేసిన త్యాగాలు! ఎన్ని సౌఖ్యాలు వొదులుకున్నాను? నా భర్తకోసం, పిల్లలకోసం-ఎన్ని కష్టా లనుభవించాను.

అధి : త్యాగాలా-త్యాగాలు చేస్తే చేశాననే జ్ఞానం వుంటుందా? కాని విశాలమైన ప్రపంచం, బాధలతో రోగాలతో నశించే జీవులుండగా కొవ్వి తిని కూచునే భర్తకూ పిల్లలకూ ఎందుకా త్యాగం? ఏమిత్యాగం? నీకాలమూ, శక్తా? నీస్వంతమూ కాలమూ శక్తి? వాటి విలవ ఎంత? జ్ఞానం లేదు, సౌందర్యపిపాసలేదు, ఆత్మ వికాసం లేదు. నీలోఏమున్నది త్యాగం చేసేందుకు? సాధారణమైన ప్రేమైనా లేదే?

రామ : నా పిల్లల్ని ప్రేమించలేదా?

అధి : ప్రేమించావా? మృగము ప్రేమకన్న ఏమైనా అధికమైనదా నీ ప్రేమ? ప్రేమ అనే పేరును అపవిత్రం చేయకు. సేవ చేశావు. అంతే. ప్రేమంటే, సహజ సంబంధమంటే అర్థం తెలుసుకో. వేశ్యవై పుట్టు.

ఫిలాసఫర్ వెంకటప్ప.

వెంకటప్ప : ఎన్నాళ్ళ 'వెయిట్' చేశాను మిమ్మల్నిట్లా చూచి, అడగాలని! ఎన్ని సంవత్సరాలు, ఎంత యోచించాను! ఈ సృష్టి మొదలెక్కడ! ఎంతకాలం కిందట! అంతకుముందు ఏమున్నది? అంతం ఏమిటి? ఎప్పుడు? ఇంకా లోకాలు వున్నాయా? ఆ నక్షత్రాలకు గ్రహాలు వున్నాయా? జీవితం వుందా వాటి మీద? ఈ రంగులు, శబ్దాలు, వీటిని కల్పించే పదార్థం ఏమిటి? అంతా మాయా? ఈ సృష్టివుందా, లేక మా భ్రాంతేనా? కలా? ఆత్మలనేవి వున్నాయా? వేటికి? మృగాలకూనా? కీటకాలకు, వృక్షా లకు? లోకంలో ధర్మమూ, సత్యమూ, న్యాయమూ వున్నాయా! లోకానికి అతీతములైన వాస్తవాలు వున్నాయా, ఏ సృష్టికర్త హృదయంలోనో? లేక చదలవంటి యీ మానవ కీటకాలు కల్పించుకున్న మోసాలా? మరి మా క్షుద్ర మానసాలకు—

అధి : ఆగు. వీటన్నిటికీ నేనే సమాధానం చెపితే మీ లోకంలో ఆ శాస్త్రిలు, సయున్సులు అన్నీ యెందుకు? నీ ప్రయత్నం ఘనత యేముంది?

వెంక : ప్రయత్నమంతా ఐపోయింది. ఇంక యీ మనసు తనలో తనే చక్రంవలె తిరగవలసిందే గాని ఇంక ఏమీ తెలుసుకోలేదు.

అధి : ప్రయత్నం అనంతం–నూతన శక్తులూ, యింద్రి

యాలతో ప్రయత్నం చెయ్యబోతున్నావు- సూర్యు డిలో యీసారి.

వెంక : ఆ అగ్నిలో—

అధి : నీ శరీరమే వేసు.

వెంక : నాకు జన్మలు వొద్దు. ఈ సమస్యలతో బాధపడలేను. నన్ను బాధనించి తప్పించండి. సుఖంగా వేరే చింత లేక బతకగల సాధారణ మానవుణ్ణి చెయ్యండి.

అధి : తిరిగీ జడుడివీ అనాగరికుడివీ అవుతావా? భోజనంతో నిద్రతో సుఖంగా జీవించే యీ సామాన్య ప్రజా బాహుళ్యంలో చేరిపోతావా మళ్ళీ! ఆ బాధ! అమూల్యమైన ఆమనోతపనను గోల్పోయి యెందుకు? ఎన్ని లక్షల జన్మలు పొందావు, ఆ బాధని సంపా యించేందుకు? ఎన్ని అనుభవాగ్నులలో తపనపొంది సంపాయించావు, ఆ జ్ఞానతృష్ణని? పాపం. పాపం. ఎంత తపన పొందావోయీ!

వెంక : (కోపంతో) నాకెందుకు చెప్పవు యీ సృష్టికారణ మేమిటో? ఈ రహస్యమూ, దాపరిక మెందుకు?

అధి : నేనే చెప్పగలిగితే, చివరికి ఈశ్వరుడైనా చెప్పగలి గితే, చెపితే నీవు అర్థంచేసుకోగలిగితే యీ అపార మైన సృష్టి యెందుకు? త్వరపడకు వెళ్ళు.

వెంక : ఒక ప్రశ్నకు సమాధానం చెప్పండి. నేను చివరి పదేళ్ళూ సాధించ ప్రయత్నించిన సమస్య-ఎలక్ట్రా న్‌లో-

అధి : తెలుసు-సూర్యుడితో అర్థమవుతుంది. వెళ్ళు.

వెంక : నేను ప్రయత్నించి, ప్రయత్నించి, నా మనసులో వెతికి వెతికి, ఈశ్వరుడు లేడని నిర్ణయించాను.

అధి : ఎందుకు?

వెంక : ఉంటే, ఇంతకన్న తెలివిగా, 'సిస్టమాటిక్' గా వుండేది సృష్టి. ఏమీ అర్థమూ, ఆలోచనా లేనిది లోకం- వున్నాడా యీశ్వరుడు?

అధి : వున్నాడని తోచిందాకా, సృష్టి అర్థం కనపడ్డదాకా ప్రయత్నించు. తొందరేమి?

వెంక: నమ్మనివాళ్ళకు శిక్ష వుందన్నారు.

అధి : నమ్మకపోవడమే శిక్ష. ఆ బాధంతా అదే.

వెంక: మరి నమ్మే ఆక్షుద్రులు ఈశ్వరుణ్ణి ప్రార్థిస్తో, స్తుతిస్తో ఆనందించే ఆమూర్ఖులు, ప్రపంచసమస్యలే అర్థంకాని పశువులు — వాళ్ళు నమ్మగలరు యీశ్వరుడున్నాడని — వాళ్ళ భయం, స్వార్థం, కాపీనం- అవే వాళ్ళ ఈశ్వరుడు.

అధి : అవును. వాళ్లు నమ్ముతున్నారా? నమ్మడమే వాళ్ళ శిక్ష—అట్లా క్షుద్రంగా నమ్మడమే వాళ్ళనరకం.

రిఫార్మర్ శివయ్యవచ్చాడు.

శివయ్య: (పాడుతున్నాడు.)

"తల్లీ నీవు-పిల్లలు మేము
దయను చేసీ-తనుపుము
ఉల్లము రంజిల్లగ నీ

యెుంకి నిను కోని కాపాడుము
పతితా పావనుడవు నీవు."

అధి : అబ్బా—ఆపు.

శివ : ప్రభో, నాజీవితమంతా నీ ప్రార్థనలో గడిపాను.

అధి : ఎందుకు?

శివ : నేను పాపిని. నీవు దయామయుడవు. క్షమించు.

అధి : కాదు, నేను రుద్రుణ్ణి. పాపాలకు శిక్ష ననుభవించి తీరాలి. అన్ని పాపా లెందుకు చేశావు?

శివ : నేను పాపాలేమీ చెయ్యలేదే?

అధి : పాపిని అన్నావే?

శివ : ఏవో పాపాలు చెయ్యకుండా ఉంటానా అనుకున్నాను.

అధి : మరి పాపాలు ఎందుకు చెయ్యలేదు, మూర్ఖుడా? నీకు శక్తి లేదే? పాపమంటే భయం.

శివ : నీ ఆజ్ఞానుబద్ధుణ్ణయి——

అధి : నా ఆజ్ఞలు నీకేం తెలుసు?

శివ : మరి న్యాయమూ, సత్యమూ, నీతి——

అధి : ఆమాటలకు అర్థం తెలుసునా? నీవంటి మూర్ఖులు చెప్పిన వ్యాఖ్యానాలు గాక! ఎన్నిజన్మ లెత్తితే అర్థం చేసుకోగలవు నీతి అంటే? తెలుసునను కున్నావు. నీ ప్రార్థనలకు మోసపోయి, నీ తర్జుమాలకు నేను ఒప్పుకుంటా ననుకున్నావు. నన్ను ఆ సత్యమనీ, నీతి అనీ ఆరాధించి సుఖంగా పర లోకం కొట్టేదా మనుకున్నావు. నీ భార్యను

ప్రేమించావుకదా! ఆమె కురూపి, లోభి, నీచురాలు —అవునా? ఆమెను ప్రేమించావు. కురూపత్వాన్ని, నీచత్వాన్ని, లోభత్వాన్ని, ప్రేమించిననీవు, నన్ను ప్రేమించ గలవా? నీ నీచ దైవం దగ్గరకే పో.

శివ : మరి భార్యను ప్రేమించడం విధి, ధర్మము.

అధి : ధర్మమని ప్రేమించావా! ప్రేమఅంటే ఎరుగుదువా! ఎన్నటికన్నా తెలుసుకో గలవా? ఎన్ని యుగాలకో! ప్రేమాన్వేషణంలో నీవు శాసించిన వివాహ బంధా లను మీరిన వృత్తములను ద్వేషించావు. మూర్ఖుడా!

శివ : నేను ప్రజలను ప్రేమించాను. వారి వృద్ధిని కోరి, సంఘ సంస్కారానికై నాజీవితం ధార పోశాను. వితంతువులకు సంసార సుఖంలేదని, కనికరించి—

అధి : మరి భర్తలు వొదిలిన భార్యల సంగతి...

శివ : అది నీఆజ్ఞలకు విరుద్ధము...

అధి : నేను నా ఆజ్ఞల జాబితాను నీకిచ్చానా?

శివ : మరి పవిత్ర వివాహ సంస్కారమును—

అధి : లోకం అంగీకరించి మెచ్చుకున్నవి నాఆజ్ఞ లనుకు న్నావు. అంటే నీకు కీర్తినీ, గొప్పతనాన్నీ తెచ్చేవి. ఆలోకంలో సుఖమూ, ఈలోకంలో ముక్తి! ఎంత మూర్ఖుణ్ణి అనుకున్నావు నన్ను? నీహృదయంలో నిజ మైన ప్రేమ వున్నదా? వుంటే ఒక్క వితంతువుల యడలనే కలిగింది; అవునా? నీ హృదయ పరీక్ష చేసుకో. వితంతువులంటే ప్రీతి. వాళ్ళని అనుభవిస్తే

నరకమని భయం. అందువల్ల వాళ్ళకు పెళ్ళిళ్ళు చేసి, ఆభర్తల ద్వారా తృప్తి పొందావు. కాదా?

శివ : అవును! కాని నీ నామాన్ని ప్రచారం చేశాను.

అధి : ఎందుకు? యీశ్వరుణ్ణి చూడలేని వాళ్ళకి- యీశ్వరుడి నామం ఎందుకు? ఎందుకు యీశ్వరుణ్ణి తలుచుకోవడం, స్తుతించడం? ఇంకేమీ పనిలేదూ? మనుషులకన్న మూర్ఖుణ్ణిఅని ఆశపడ్డావు. సంస్కరించావా? నాలో కాలు నీను సంస్కరించుకోలేనూ? అజ్ఞానుడివి. లోభివి, మోసగాడివి. ప్రేమించడంనేర్చుకో. నిన్ను, నీకీర్తిని, నీవృద్ధిని మరిచి లోకాన్ని, ప్రాణుల్ని, ప్రేమించడం నేర్చుకో. నేను శాస్త్రాలను, నీతిని, ధర్మాలను వేటినీ ఏర్పరచ లేదు. అబద్ధ ప్రచారం మానివెయ్యి. అన్ని న్యాయాలకూ, నీతులకూ అతీతమైన ప్రేమని నేర్చుకో. సౌందర్యాలు, జ్ఞానాలు, తెలీని మూఢుడివి, జడుడివి. నీ సంస్కారాలూ, సంస్కరణలూ అవసరంలేని యీ ఊర్ధ్వ లోకాలు నీకేం అర్థమౌతాయి? శునకానికివున్న నిర్వ్యాజము, ప్రత్యుపకారాన్ని కోరనిదీ ఐన ప్రేమను తెలుసుకో, పో.

తారాసింగ్.

తారాసింగ్ : మీరు పాలించే భూలోకంలో న్యాయమనేది లేదు. ఇంక యీ లోకంలో ఏముందో.

అధి : తారాసింగ్ - పాపం!

తారా: మీరే నేనే మోక్ష ఈశ్వరుడు. సంక్షైర సౌఖ్య-నాయకత్వం, వృద్ధాప్యం, అంతా-కైదులో మగ్గాను. మనుషులను, కాంతిని, నవ్వును-ప్రేమను ఏమీ ఎరగను-మీలో నమ్మకమే పోయింది. పగలు రాత్రి ప్రతిఘటించీయూ దూషించాను మిమ్మన్ని, మీ కాఠిన్యాన్ని, మీ అన్యాయాన్ని. వృపేక్షను శిక్షిస్తారా, శిక్షించండి. అర్థంలేని శిక్షలకు అలవాటుపడ్డ నేను, భయమునూ బాధనూ వర్జించాను. ఒక్క-వర మియ్యండి, మీకు శక్తివుంటే -నా దేశానికి మోక్షమివ్వండి.

అధి : అర్హత పొందండి, వ్యక్తులకుగాని, దేశాలకు గాని మోక్షం రాదు.

తారా: జీవితమంతా - నా ఆరోగ్యం, నా ధనం, నా ఆనందం ధారపోశాను.

అధి : నాకు తెలుసు (అధికారి తారాసింగును కావిలించుకున్నాడు.) ఒక్క-ఉద్దేశ్యం కోసం, ఏకాగ్రచిత్తంతో తీవ్రత్యాగం చేసిన యోధుడివి. ప్రజల స్తోత్రాలను, అభినందనాలను, కీర్తిని తృణీకరించి, ఎవరూ ఎరగని నరకంలో కాలిపోయినావు, ధీరుడివి. పాపం! నీకు శాంతి నిస్తాను, రా.

తారా: నన్ను హింసించిన వాళ్ళని- అక్రమంగా, అధర్మంగా, క్రూరంగా నన్ను—

అధి : నిన్ను హింసించినవాళ్ళూ, వాళ్ళ స్వభావానుగుణ్యంగా వాళ్ళ ధర్మాన్ని నెరవేర్చుకున్నారు. అగ్ని తాకితే బాధ- అగ్నిమీద ఆగ్రహించి ఏం లాభం!

తారా: కాదు. తెలిసి, ఆలోచించి, అధికారాంధులై, స్వార్థ దురభిమాన పీడితులై, నానోరు నొక్కి, నన్ను బంధించి నన్ను చీల్చి- రాక్షసులు.

అధి : కాదు- నీకర్థమౌతుంది ముందు. వాళ్ళూ నీ వంటి వాళ్ళే! నీవంటి త్యాగాలకు సంసిద్ధులే. స్థాన భేదం. అంతే. యువజనుల్లో నీ హృదయాగ్నిని కవిత్వంలో కరిగించి, గుప్పించి, యువకుల హృదయాల్ని ప్రజ్వలింప జేసి- లోకాలే నిన్నారాధిస్తాయి. దేవత్వాని కెత్తుతారు. ఐశ్వర్యం, ఆనందం, గౌరవం, నీవు కోర గలిగినది ఏదీ లోపంరాదు. పాపం ఎంత నలిగి పోయినావు. నీ ఆగ్రహం శాంతిస్తుంది. జీవితం అర్థమౌతుంది.

నీ దేశభక్తి కన్న, నీ శరీర బాధకన్న, నీ కార్పణ్యం, నీ క్రోధం నిన్నెక్కువ కాల్చాయి. వాటికి అతీతుడవు కావాలి.

నిరీశ్వరవాది చలం.

చలం : నువ్వు లేవు, అబద్ధం.

అధి : నువ్వా?

చలం : వున్నా నీకూ లోకానికీ సంబంధం లేదు.

అధి : నీకూ, నాకూ?

చలం : వున్నా, నువ్వు శక్తి హీనుడివి. నువ్వు లోకాలు సృజించలేవు. సృజించినా నీశక్తి కతీతాలై నీకు తిరుగబడ్డాయి. నువ్వు వుండి యేం చేస్తున్నావు?

అధి : నేను లేనుగా!

చలం : వుండడం మరింత భయంకరంగా వుంది. మృత్యువుతో నేనంతమౌతానని నమ్మి ఆశపడ్డాను. నన్ను నాశనం కానీక మృత్యువుతోనన్నా నాకు శాంతి నియ్యక ఇక్కడ తేల్చావు. నువ్వువుండికూడా ప్రజలలోయీ మూర్ఖం, యీ అన్యాయం, యీ రోగాలు, ఈ యుద్ధాలు, మరణాలు, విలాపాలు— ఏమి సంతోషం నీకు? రాక్షసివా? నీ కళ్ళూ, చెవులూ చెదలు పట్టాయా? ప్రపంచంలోంచి నిరంతరము భయంకరంగా బైలుదేరే రోదన యిందాకా వినపడదా?

అధి : మరి భయంకరమైన జీవితాన్ని వదలరేం ప్రజలు? మార్గం వుంది కదా?

చలం: మూర్ఖులు- కాని నీకేం ఆనందం?

అధి : పుట్టినపిల్ల మూర్ఖురాలు—నిరంతర రోదనకి, నిద్రపేమిటా ఆనందం తల్లికి?

చలం: తల్లి సంతోషం కోసం బిడ్డలు వేదన పడాలా?

అధి : బిడ్డకికూడా సంతోషమే. బలహీనురాలై తల్లినించి ప్రేమను పొందే ఆనందం, పిపీలికాది సకల ప్రాణుల నరాలలో, రక్తంలో ఆత్మలో, బాధలలో కలిసి లీనమై ఈశ్వరుడు ఆ వేదనంతా అనుభవిస్తున్నాడని తెలుసా నీకు?

చలం: ఐతే, నిన్ను చూసి జాలిపడాలి. నీవేనా ఈశ్వరుడు?

అధి : ప్రపంచాన్ని ప్రేమించావు.

చలం: ఏం లాభం, ప్రేమించి? క్షుద్రస్వార్ధయుత ప్రేమనే గాని, జ్ఞానమూ ఔన్నత్యమూ గల వాస్తవప్రేమను చూపి వారి ఆనందానికై తపనపడ్డవారి నందర్నీ సిలువ వేస్తోంది నీ ప్రపంచము. ప్రేమించి ఏమి లాభం?

అధి : ప్రేమించడం నీ వికాసం కోసం. లోకక్షేమం నేను చూసుకోగలను.

చలం: చూసుకోగలవా? నీ అంత వ్యర్థుడూ, ఆడంబరుడూ లేడు. మా లోకంలో అధముడు కూడా నీకన్న ఉత్తముడు. ప్రజలచాత నీవు పొందే పూజలు, నైవేద్యాలు, బలులు, స్తోత్రాలు, ప్రార్థనలు—లక్ష పేర్లతో నిన్ను పిలిస్తే ఏమిటి నీ సంతోషం? బధిరుడివైన నీ ముందు మోకరించి రక్తపు కన్నీళ్ళతో వెర్రిప్రార్థనలు చేసే నిర్భాగ్యుల దైన్యమైనా నిన్ను కరిగించదా?

అధి : ఆ పూజలన్నీ మానవుల హృదయంలో వుండే భయ దేవతకి, మంగళ దేవతకి, దైన్య దేవతకి— నాకు కాదు. నా కేమీ ఆనందం లేదు.

చలం: మరి ఎంత మోసం! నీమతమని, నీ ఆజ్ఞలని, నీకు ఆనందమని, నీ కరుణ కలుగుతుందని మోసపోయి నీ పేర ఎన్ని దారుణకృత్యాలు, ఎంత వేదన!

అధి : నిరంతరమూ నిరాకరిస్తున్నాను. నమ్మరు. అగ్నినించి ఎన్ని దారుణకృత్యాలు జరుగుతున్నాయి. అగ్నిని నిరాకరించనా ప్రజలకు?

చలం: నోరులేని పశువులు పడే దినదిన బాధ, నోరు లేని పసి పిల్లలు పడే నరక బాధ, పంజరాల్లో పిట్టలు పొందే చెప్పలేని నరాల బాధ— అధికారులు, ఐశ్వర్యవంతులు సుఖంలో పడే వూపిరాడని మర్యాద బాధ, ఎందుకు? పాములు, వరదలు, భూకంపాలు, ఎందుకు? ధనము, జ్ఞానము అన్నీ దాచుకుని నిర్భాగ్యుల్ని పీడించి... నువ్వేనా ఆ నీతిచట్టాలను శాస్త్రాలను కల్పించింది? ఆ నీతి పేర ప్రజల్ని దండించి నలిపి నాశనం చేసే వాళ్ళకి ఏం శిక్ష? నరకమని భయాలు పెట్టి తప్పు పనులు చేయించి, ప్రేమను, ఔదార్యాన్ని నొక్కి నాశనం చేసి శిక్షించు శిక్షించు.

అధి : శిక్షించనా? ఆ మూర్ఖులను, అంధులను శిక్షించారా, అని నీవే నిందిస్తావు.

చలం: అవును. అవును. నా కర్థం కాదు. నా తల చీలికలై పోతోంది. శాంతి. శాంతి.

అధి : శాంతి కాదు. కాంతి కావాలి నీకు. బాహ్య ప్రపంచాల కన్న నీలో అంతః ప్రపంచాలు వున్నాయి. వాటిని పరీక్షించు. ఈ జన్మలో ప్రజల చేత ద్వేషింప బడి, ఏకాంతవాసములో జ్ఞానార్జన ప్రారంభిస్తావు. వెళ్ళు.

చలం: ఒక్క వరము. ఒకటే ఆశ నాకు. ఏ లోపమూ లేనిదీ, సంపూర్ణమైన శరీర, ఆత్మ సౌందర్యాలు కలదీ, చతురత్వమూ, విజ్ఞానమూ, కలదీ, ఘన గాఢ ప్రేమను,

నా ఆత్మ తృష్ణనంతా, నా లావణ్య పిపాస నంతా
తృప్తిపరి చగల దివ్యవ్యక్తి స్నేహాన్ని ప్రసాదించు.

అధి : అట్లాంటి దివ్యవ్యక్తి ఒకటే వుంది యీ ప్రపంచానికంతా. ఆ వ్యక్తి స్నేహం ప్రతిబింబం నీతోనే వుంది. గుర్తించే దర్శనం లేదు నీకు. అంధుడివై క్షుద్ర ప్రయాణాలతో వేదనపడతావు. అర్హతపొందిన కొద్దీ పవిత్రమైన ప్రేమను పొందుతావు. నే నిచ్చే వరమేమీ లేదు.

చలం : ఒక్క ప్రశ్న. ముక్తి వుందా?

అధి : అంటే? •

చలం : చివరికి– యీ జన్మల తరువాత!

అధి : తెలుసుకో– తొందర లేదు.

చలం : యోగమూ, మంత్రమూ, భక్తి, జ్ఞానమూ, విశ్వాసమూ, ఇవన్నీ ముక్తి నిస్తాయంటారే!

అధి : అంటారు. అంతే. నిరంతరమూ, తలుచుకో లేనంత అద్భుతమైన ఆనందం ప్రతి జీవికీ జన్మ హక్కు. ఎందుకు ముక్తి? ముక్తి అంటే బాధల నించి – ఆనందంనించి కాదు.

దుర్గమ్మ:

దుర్గమ్మ: దేవా! ఈశ్వరా కరుణించండి. మహా పాపాలు చేశాను. నా జీవిత మంతా నేను చెయ్యని పాపాలు లేవు. మీ కరుణతప్ప నాకు ఆశ లేదు.

అధి : నీకెందుకా భయం?

దుర్గ : నన్ను నరకంలో తోస్తారుట. మండే స్తంభాలకు-కాగే నూనెలో తోస్తారుట.

అధి : ఏమీ చెయ్యరు.

దుర్గ : మరి పాపాలు చేశాను.

అధి : నరకం లేదు.

దుర్గ : నా నగలన్నీ ఎత్తుకు పోయిన ఆ నరసింహం లేదూ; వాడికీ నరకం లేదూ?

అధి : ఎవరికీ లేదు.

దుర్గ : యిష్టంవచ్చినట్లు పాపాలు చెయ్యవచ్చునా?

అధి : నీయిష్టం.

దుర్గ : ఎన్ని పాపాలు మానుకున్నాను? భయపెట్టారు మూర్ఖులు, ఎన్ని అబద్ధాలుచెప్పారు. చూసివొచ్చామని చెప్పారు కొందరు.

అధి : అవును. నీకు తృప్తి కాలేదు. అద్భుతమైనవీ, దారుణమైనవీ కార్యాలు తనివితీరా చెయ్యి, ఈసారి.

దుర్గ : కాని నాకాబుద్ధి ఎందుకు కలిగింది? అందమైన మగవాణ్ణి తీసుకున్నదాకా శాంతిలేదు. ఎప్పుడూ విసుగులేని మన్మథ సౌఖ్యాన్ని కోరడం- నన్ను తృణీకరించిన వాళ్ళ మీది ద్వేషం- ఎంత ప్రయత్నించి, నలిగినా, ఆగుణాలు నన్ను వదలలేదు. ఎంత నిన్ను ప్రార్థించినా-

అధి : ఆజన్మకి, నీతో పుట్టిన గుణాలు పోతాయా? నీ శరీరపు రంగు ఎంత మారగలదో అవీ అంతే.

దుర్గ : (కోపంతో) ఆ, మీరే నన్నట్లా చేశారు. ఆ గుణాలతో సృజించారు.– తమాషా చూశారు నా బాధ అంతా–

అధి : నిన్ను శిక్షించలేదుగా?

దుర్గ : కాని ఆగుణాలు వుండడం వల్ల నాకు కలిగిన బాధ?

అధి : కాని–ఆగుణాల వల్ల నువ్వు పొందిన ఆనందమో?

దుర్గ : అవును అవును.

అధి : నీస్వభావం ఆగుణాలనుండి బయట పడుతోంది గనకనే ఆబాధ.

దుర్గ : మరినన్ను అన్యాయం చేసినవాళ్ళకి శిక్షలేదా? ఆ నరిసింహానికైనా చివరికి–

అధి : శిక్ష మాకు వదలరాదూ?

దుర్గ : కానీ నా కడుపు మంట–

అధి : శిక్షించిన తరవాత జాలివల్ల కలిగే ఆ అగ్నిని యేం చేస్తావు?

కవి—శాస్త్రి

శాస్త్రి: అంద రానిది, మాటలలో గాని, గానంలో గాని తెలియపర్చలేనిది, ఏనిమిషానా నాకు శాంతి నివ్వక ఎడతెగని తృష్ణతో వెర్రివేదనలలో పరువు లెత్తించినదీ, ఏదో మహా శక్తి నన్ను కాల్చివేసింది. ఆ సమస్యకు అర్థమూ, అంతమూ నీవేనని ఆశపడ్డాను.

జీవితం వెనక వుండే ఆనంద నృత్యానికి తాళమువేసి యీ జీవన జలధిలో పొంగి ధ్వనించే గానముతో, నాకంఠం మేళవించాలని ప్రయత్నించాను. నాలోని ప్రేమోద్రేకానికి, నా ఆశాగ్ని తపనకు యీ దుర్బల దేహం అల్పములైన ఈ ఇంద్రియాలు తాళుకోలేక అనంతమైన విశాలత్వానికై పెనగులాడాను. అన్ని గీతాలలో, గానాలలో నిన్నే వెతికి, వేసారి, విసిగి, నీ పాదాలు చేరుకున్నాను! నేను చేసిన దోషాలు, పాపాలు, యీ అనంతావేశంముందు భస్మమైన ధూమ శకటాలవలె పోతాయి.

అధి : ఏం కావాలి?

శాస్త్రి: ఏం కావాలో నాకు, నా జీవితమంతా వెతుకుతూనే వున్నాను. నీవే చెప్పాలి, నీవే కటాక్షించాలి. వివేక వంతులు నా ఆవేదన నరాలలో పుట్టిన జాడ్య మన్నారు. నీత్యధికారులు యువ్వన మదమన్నారు. నాతోటి కవులు అదొక 'పోజ్' అన్నారు. నాకే తెలియదు. మూర్ఖుణ్ణి. నీమీద ఆశ - నీవే నాకు మార్గదర్శకుడవై యీ భూమిలోని, దిక్కులలోని, చుక్కలలోని జీవనాన్నంతా నాదిగా తాగాలనే నా తీవ్రవాంఛని అర్థంచేసుకుని, ఆ బాధలోంచి దివ్య వేణురవాలు పలికిస్తావని నమ్మాను.

అధి : నీవు చంద్రుడిలో జన్మించి అమృతాన్ని చవిచూడు. శాంతి దొరుకుతుంది తాత్కాలికంగా. కాని నీ

అశాంతికి అంతంలేదు. నీ అనంతయాత్రా మార్గా
నికి ఆ అగ్ని వెలుతురు.

వీరడు- పల్లెటూరి మనిషి.

ఏడుస్తూ నుంచున్నాడు.

అధి : పాపం- [illegible] జన్మించావు - భూలోకంలో అందని గొప్ప ప్రణయాన్ని ప్రసాదిస్తున్నాను.

వీర : ఎందుకు? నాకు వద్దు. నాకు స్వర్గమూ వద్దు, గొప్ప ప్రణయమూ వద్దు. నీకే హృదయముంటే, నీకే కరుణ అనేది వుంటే, వాళ్ళిద్దర్నికూడా తీసుకురా ఇక్కడికి; నాభార్యనీ, నాబిడ్డనీ- నాకు నీ రంభలూ వద్దు, నీ దేవతలూ వద్దు; నా చిన్నిరంగమ్మా, నా రామిగా తప్ప. ఎందుకు? ప్రేమించడానికి ఎందుకిచ్చావు వాళ్ళని నాకు, క్రూరుడా, ఎంతగొప్పగా ఆనందంగా మేమిద్దరం, తరువాత మేము ముగ్గురం గడిపిన ఘడియలు! లోకమంతా సుందరంగా చేసి, నాగుడిశ, ఏరు, నాతోట- ఎండ- వెన్నెల-పక్షులు- వీటిమధ్య మమ్మల్ని మురిగించి మరిపించి - ఒక్క వేటులో - తెగగొడతావా వాళ్ళనీ, నన్నూ! ఎత్తుకొచ్చావు నువ్వు- మాబంధాలురక్తం కారుతూ వుంటే, దేవతల్నిస్తానని నన్ను బెల్లించి నవ్వుతున్నావు.

అధి : పిచ్చివాడా నీ పిల్లలకీ, భార్యకీ నీతో రావాలని లేదు.

వీరడు: నీ కేం తెలుసు?

అధి : వుంటే వచ్చేవారు కారా?

వీరడు: నేను కనపడతానని నిశ్చయమేది వాళ్ళకి!

అధి : నీకెట్లా తెలుస్తుంది, చెప్పనా! ఆ అల్ప ప్రేమలు ఎంత నిజమైనవైనా మనిషికి తృప్తి నియ్యవని- యీ ప్రపంచ మంతా, ఆనందా న్నంతా, సౌందర్యా న్నంతా ఆలింగనంలోకి తీసుకోవాలనే విశాలత్వపు అలంకారాలు మీలో వున్నాయని! ఈ విశ్వాన్ని నింపి పొంగే ప్రణయ కాంతిలో నీ రంగా రామీ చిన్న రవ్వలు.

వీరడు: ఉంటే వున్నాయిలే. అర్థం కాకపోతే పోయిందిలే. ఎవరికేం లాభం మనుష్యుల్నిట్లా విడ తియ్యటం, ఏడి పించడం?

అధి : నీకళ్ళు తెరిచే ప్రయత్నం అది, యీ కన్నీళ్ళా- బాధ- అవును. బాధ బాధతోనేగాని అర్థంకాదు. పో. వెళ్ళు. తొందరలోనే మరిచి పోతావు.

వీరడు: మరిచి పోతానా? నేను మరిచిపోను. మళ్ళీ జన్మ నిచ్చి నా జ్ఞాపకాన్ని అలికేద్దామనా నీ యత్నం! వీల్లేదు. మరిచిపోను. ఏం చేస్తావు, రాక్షసీ! పోయి నారు, వాళ్ళిద్దరూ పోయినారు. ప్రభూ వాళ్ళ జ్ఞాపక మన్నా నాలో బతకనీ.

అధి : నీకు వాళ్ళమీద ప్రేమ వున్ననాళ్ళా నీ హృద యంలో సౌందర్యంలో ఔన్నత్యంలో కలిసి జీవించే వుంటారు.

వీరడు: నా బాధ లక్ష్యంలేదు– కాని వాళ్ళిద్దరూ నా కోసం ఎంత ఏడుస్తున్నారో! అదే నాగుండెను పిండుతోంది. సాయంత్రాలు రంగణ్ణి ఎవరు ఒళ్ళోకూచో బెట్టుకుని ఆడించి నవ్విస్తారూ? రామి పెదవులమీది చిరునవ్వు– భరించలేను. నీస్వర్గం నాకు వొద్దు. నన్ను మళ్ళీ ఆ లోకానికి పంపు– వాళ్ళ గుమ్మం దగ్గర పురుగుగా– వాళ్ళు కనపడితే చాలు– అసహాయులు వాళ్ళు కనికరించు.

అధి : గోలపడకు. నీకన్న కరుణగలశక్తి వాళ్ళసంగతి కనుక్కుంటోందిలే వెళ్ళు.

———

# రంగదాసు

పాత్రలు :

రంగదాసు
చుక్కమ్మ
శీత
పోలీసు
దొంగ

## ఒకటో రంగం

రంగదాసు యిల్లు. చుక్కమ్మ యిటూ అటూ పనిచేస్తో తిరుగుతోంది. శీత, పనిపిల్ల అప్పుడే యింటోకి వొచ్చింది, పోడ్లోంచి.

చుక్కమ్మ: సీతా, నీళ్ళు కాగలేదూ ?

శీత : లేదండీ.

చుక్క: ఇంకా కాగలేదు టే! మంటసరిగ్గా పెట్టలేదుగావునూ నువ్వూ!

శీత : మీరేగా మంటచేసింది, అమ్మా!

చుక్క: మాటకి మాట ఎదురు చెప్పడం! మంచిదికాదు నౌకర్లకి.

శీత : సరే అమ్మా!

చుక్క: ఈసారి నాకు కోపం తెప్పించకూ.

శీత : తెప్పించను అమ్మా!

చుక్క: అన్నయ్య యింకా రాలేదు. పదయింది... ...శీతా!
శీత : యేమండీ అమ్మా!
చుక్క: అయ్యగారు ఎక్కడికి వెళ్ళారో నీ కేమన్నా తెలుసా?
శీత : తెలీదండీ అమ్మా!
చుక్క: నాతో యేమీ చెప్ప మన లేదూ?
శీత : అన్నారండీ అమ్మా!
చుక్క: అన్నారండీ అమ్మా! అన్నారండీ అమ్మా! ఐతే యెందుకు చెప్పలేదు నువ్వు?
శీత : ఇప్పుడు చెపుతాం కదండీ అమ్మా!
చుక్క: ఇప్పుడా! ఇందాకట్నించీ ఏం చేస్తున్నావు?
శీత : మీరు అడగ లేదు కదండీ అమ్మా!
చుక్క: అడక్కపోతే మాత్రం చెపితే తప్పా! ఏం చంపుకు తింటున్నావే!
శీత : పొద్దున్న, అవసరం లేకుండా మాట్లాడవొద్దన్నారుగా అమ్మా!
చుక్క: అయ్యో నా ఖర్మం కాలా! నేను పడ లేనమ్మా దీంతో!
శీత : అవునమ్మా!
చుక్క: వూరికే చిలకమల్లే అవునమ్మా, అవునమ్మా అంటో కూచోకు. వొళ్ళు మండిపోతోంది నాకు.
శీత : అవునమ్మా!
చుక్క: సరేలే, అయ్యగారు ఎక్కడికి వెళుతున్నామని చెప్పారు?

శీత : మాయింటికి అమ్మా!

చుక్క: మీ యింటికా! మీ యింటికి! ఎందుకు పంపారండి దొరసానిగారు తమరి యింటికి!

శీత : అమ్మకి వొళ్లావుందని అయ్యగారు అడిగారు. ఏమీ నయంగా లేదని చెప్పాను.

చుక్క: నయంగా లేదని చెప్పావూ? మీ అమ్మకి నయంగా లేదని చెప్పి, అయ్యగారికి తిండి లేకుండా, వూరిబైటకి పంపించావు టే యీ అర్ధరాత్రి?

శీత : అమ్మగారూ! నీళ్ళు మసిలిపోతున్నాయి.

చుక్క: సరే నేను చూస్తాలే, చెంబులుతోము. వెండిగ్లాసులు తోమ నక్కర్లేదు.

శీత : వెండిగ్లాసులా, అమ్మగారూ?

చుక్క: అవును. వెండిగ్లాసులే. నీ కేం చెవుడుకూడా నా?

శీత : అమ్మేశారుగా అమ్మా!

చుక్క: అమ్మేశారూ? అమ్మేశారూ? నీ కేం పిచ్చిపట్టిందా? ఎవరు అమ్మారే! ఎందుకు అమ్మారు?

శీత : అయ్యగారు ఇందాక మధ్యాన్నం వెంకటప్పయ్య దగ్గిరికి తీసికెళ్ళి, వాటికి యెంతయిస్తే అంత సొమ్ము తీసుకురమ్మన్నారు.

చుక్క: నన్నడకుండా నిన్నెవరు అమ్మమన్నారు?

శీత : మరి అయ్యగారు అడగమనలేదు అమ్మా!

చుక్క: అయ్యగారు— కాని — డబ్బు కావలసిన అంత అవసరం ఏమొచ్చింది మధ్యాహ్నం అయ్యగారికి!

శీత : పున్నమ్మకోసర మనుకుంటూనండి.

చుక్క: పున్నమ్మ కోసమా? పున్నమ్మ కోసమే! ఆ తిప్ప మీాద గుడిశలో వుండే ఆ యెరికలదేనా? దొంగది, పని చెయ్యడానికి బద్ధకమేసి, రోగమని దొంగ వేష మేస్తుంది. ఎప్పుడూ రోగమే. సరేలే. దానికి డబ్బెం దుకు కావలసి వొచ్చిందో!

శీత : అదెవరికో బాకీట! అమీానావచ్చి దాని సామానులు వేలం వేస్తున్నాడు. అప్పుడు అయ్యగారికి కబురు పంపింది.

చుక్క: కబురుపంపిందీ! దొరసానిగారు! దేవుడా, ఈఇంటో కాపరమెట్టారా నాయనా! ఆస్తి అంతా అమ్మి బీద లకి పెట్టాడు. ఇంటో సామానులన్నీ అమ్మేశాడు. నాకు మానాన్న యిచ్చినది కాస్తా, అదీ అయి పోయిందా, యింక మాడి పోవలసిందే! అయ్యో! చక్కని పంచపాత్రలూ, అవీ పోయినాయూ, చివరి కీవాళ! ఇంక భరించడం కష్టం... ...

ఏడుస్తోంది.

శీత : అమ్మా! నాకు దిగులేస్తోంది. తెలీలేదండి.

చుక్క: నీకెందుకే విచారం? అయ్యగారు తన వెండి పంచ పాత్రల్ని అమ్ముకుంటే అమ్ముకోనీ! నీకూ నాకూ ఎందుకు? వెళ్ళి చేతులు కడుక్కో. మకిలి చేతులూ నువ్వూనూ.

శీత : సరే, అమ్మా.

రంగదాసు వొచ్చాడు.

రంగదాసు: అబ్బా! ఎంత వెచ్చగావుంది ఇంటో! హాయిగా వుంది. రంగా, రంగా! ఏమిటి? ఏమిటి సమాచారం? ఏడుస్తున్నట్టున్నావే? ఎందుకు? శీత సరిగాపనిచెయ్య డంలేదా? రంగా. రంగా! ఏమే శీతా!

చుక్క: శీత ఏమీ చెయ్యలేదు.

రంగ : అయితే, యింకేమిటి సంగతి? సరేలే అమ్మా శీతా, ఇంటికి వెళ్ళు. మీఅమ్మకి నయంగానే వుంది. నేను వెళ్ళి భజనచేసి ధైర్యంచెప్పి వొచ్చాను. డాక్టరుకి చూపించాను, వెళ్ళు.

శీత వెళుతూంది.

అమ్మ నిద్రపోతో వుంటే చప్పుడు చెయ్యకండా పడుకో. రంగా, రంగా; ఇదుగో వుండు. ఈ శాలువ కప్పుకుపో. చలిగావుంది.

శీత : వొద్దండీ, అయ్యగారూ!

చుక్క: వూరుకో అన్నయ్యా! దానికేం చలి!

రంగ : నీకేం తెలుసు చుక్కా! ఎంత చలేస్తేం దనుకు న్నావు బైట! రంగా రంగా! (శాలువ కప్పి) ఇంక వెళ్ళు, పరుగెత్తు. (శీత వెళ్ళింది.)

చుక్క: అన్నయ్యా! ఇంక నీతోలాభంలేదు. సరేలే, భోజ నానికిరా.

భోజనం చేస్తున్నాడు.

రంగ : రంగా, రంగా! కస్తూరిరంగా!

చుక్క: శీత తల్లికి నిజంగా అంత జబ్బుగా ఉందనా? నువ్వా అర్ధరాత్రి దాకా కూచో పఁసిన అవసరం యే మాత్రము లేదు. పిలిచిందే చాలునని జాలిపడి వెడతావు కదా అని అతి చవక వాళ్ళకి. లేని జబ్బులన్నీ నటిస్తారు.

రంగ : నేను రావాలని కోరుకోడానికి నామీంద ఎంత దయ వుండాలి వాళ్ళకి! రంగడి మహిమ! రంగడి దయ నాకు వాళ్ళ కళ్ళల్లో కనపడుతుంది.

చుక్క: ఎప్పుడూ వాళ్ళ సంగతే. కాని, ఇంటో వాళ్ళు చచ్చినా దిక్కులేదు.

రంగ : అట్లా అనకు. సీత నామీంద ఎంతదయ లేకపోతే ఈ అటుకులు ఇంత రుచిగా చేస్తావు! ఎక్కడ చూసినా యింటో, వూళ్ళో నాచుట్టూ అంతా రంగడి దయ!

చుక్క: అవును మరి. నే నన్నా నీ జాగ్రత తీసుకోక పోతే ఏమౌతావు నువ్వు! ప్రతిసోమరిదీ, ప్రతి పకీరువాడూ అబద్ధాలు చెప్పి నిన్ను మోసగించే వాళ్ళే కదా!

రంగ : నన్ను మోసంచేస్తే వాళ్ళకే నష్టం! అయినా నన్నెందుకు మోసం చేస్తారు! నా రంగడు నన్నెందుకు మోసంచేస్తాడు! వాళ్ళందరూ ఎవరు! రంగడే-అన్ని రూపాల నా దగ్గరికి వొస్తాడు. బలే కొంటె.

చుక్క: సరేలే. మంచి రంగడే. మరి వాళ్ళందరూ అబద్ధాలు చెప్పి మనయిల్లు గుల్లచేస్తున్నారు కద! నానన్న యిచ్చిన ఆస్తంతా అట్లా పోయింది. అమ్మ నగలు,

చెంబులు, తప్పాలాలు— ఇంక మనకేం మిగులుతుంది!
ప్రతిదీ అడిగిన వాళ్ళకల్లా యిట్లా యిచ్చేస్తోవుంటే.

రంగ : మనకా! రంగడు చూస్తాడు లెద్దూ! పాపం వాళ్ళ కెవరు చూస్తారు! చుక్కా! లోకంలో ఎంతదరిద్రం, ఎన్ని రోగాలు—ఎంతయిస్తేమాత్రం— మన రంగడికి.

చుక్క: అవును లోకంలో బాధేకాని, యింటిదగ్గిర నేనుపడే బాధ నీకు కనపడదు!

రంగ : నీకా! నీకు బాధా! నీకు విచారమా! అవును. యిందాక యేడుస్తున్నావు— నామూలానే! పాపం.

చుక్క: అవును. పాపం అట! చేసేపని చేసి పైగా పాప మంటావు. కాఫీ, భోజనం కానీ.

రంగ : ఏం చేశానో చెపితేకాని, నేను భోజనం చెయ్యను.

చుక్క: పసిబిడ్డ నయం. ఒక్క నిమిషం నిన్ను వొంటరిగా వొదలడానికి వీల్లేదు కదా! గుళ్ళో పురాణం చెపుతున్నారంటే ఒక్క నిమిషం వెళ్ళి వొచ్చానో లేదో! శీతచాత పంచపాత్రలు అమ్మించావు.

రంగ : పంచపాత్రలు కాదూ! అవును. అమ్మాను. ఓ. అవును వాటిని చూస్తే నీకు ప్రాణం.

చుక్క: అమ్మమ్మ యిచ్చింది.

రంగ : అవును, ఏం చెయ్యను. ఎంతో అందంగా వుండేవి. కాని చుక్కా, నీళ్ళుతాగడానికేగా! ఇత్తడిగ్లాసులో తాగుదాం లెద్దూ!

చుక్క: అవును. అన్నం నేలమీద పెట్టుకుని తినకూడదమా! కాని ఆ ముసలిముండ పున్నమ్మ డబ్బు కావాలని నీకు కబురు పంపించడ మేమిటి? పిచ్చివాడివి నువ్వు గ్లాసు లమ్మి డబ్బియ్యడ మేమిటి? సిగ్గులేదూ దానికి! మొన్న నేగా దాని మొహం వాచేట్టు చివాట్లు పెట్టాను! సిగ్గులేదు కద!

రంగ : చివాట్లు పెట్టావా, పాపం! అందుకేగావును మనింటో వచ్చి నాలుగురోజులు వుండమంటే రానంది. పాపం ఆమె మనసుకి ఎంత కష్టం కలిగించావో...... ఆ మార్వాడి ఆయనంతో దయగలవాడే– కాని పాపం అడగడానికి వీల్లేని యిబ్బంది కలిగిందట– ఆయనకీ డబ్బు అవసరమంట– వేలం పెట్టాడు– నేనివ్వ వలసి వొచ్చింది.

చుక్క: బాగా యిచ్చావు.

రంగ : మరి నా దగ్గర డబ్బు లేదయ్యేను– ఆస్పత్రిలో కోటయ్య కిచ్చేశాగా! ఎట్టానా అనుకుంటున్నాను. సమయానికి పంచపాత్రలు ఇంటోవుండడమూ అదృష్టమే, రంగడి దయ! నీకు కష్టంకలిగించాను కద!

చుక్క: సరేలే! నిన్ను అని యేంలాభం! ఈ సారి నీ దేవతార్చన పెట్టె అమ్ముతావా? అదేగా మిగిలింది.

రంగ : అమ్మను. అమ్మను. అది అమ్మడానికి వీల్లేదు.

భోజనంచేసి లేచాడు.

చుక్క: ఏం! ఎందుకు అమ్మవు? అప్పులున్నవాళ్ళు లేరా లోకంలో!

రంగ : అప్పను నువ్వు చెప్పింది బాగానే వుంది. ఎంత మంచి దానివి చుక్కా! పూరికే అరుస్తావుగాని, నీ హృదయంలో మాత్రం దయలేదూ! కాని అమ్మ తన కోసం జ్ఞాపకార్థం అట్టిపెట్టుకోమంది ఆ పెట్టెని. జ్ఞాపకం వుందీ? ఏమైనా సరే దాన్ని అమ్మడానికి వీల్లేదు. అయినా, నానిమీద కాపీనం వుండడం కూడా తప్పే! ఎందుకు ఇచ్చిందోగాని!

చుక్క: నా గుండె చీలుస్తున్నావు అన్నయ్యా! నేనిక భరించలేను. పడుకుంటాను, యీపూట నీ బుర్రతో కడుపు నిండింది...... తొరగా పడుకో, తెల్లారిందాకా అట్లానే కూచోకు. నువ్వు ఎంత ఆలోచించినా లోకంలో కష్టాలు యీనాడు తీరేవి కావు.

(వెళ్ళింది)

— ... —

# రెండో రంగం

రంగదాసు ఆలోచిస్తో కూచున్నాడు. దొంగవచ్చాడు లోపలికి.

దొంగ: అరిచావంటే, చంపేస్తా.

రంగ : నేనెందుకు అరుస్తాను? ఏం కావాలి నీకు?

దొం : నాకు తిండి కావాలి, మూడు రోజుల్నించి వుపోషం. తొరగా, వెధవా, ఏదోవోటి పెట్టు తినటానికి.

రంగ : అంత అడావిడీ ఎందుకు తమ్ముడూ? యింటో వున్న వేవో నువ్వే తినెయ్యి. మా చెల్లెల్ని లేపి వొంటింటి తాళం చెప తీసుకొస్తాను. వుండు.

దొం : కూచో. లేవకు, కదలకు, ఈ వేషాలు నాకు చాలా తెలుసు. జిత్తులలోపడి మోసహొయ్యే ఘటంకాదిది. చాలా పాత చెయ్యి. ఊహూ, చెల్లెలిస తాళంచెవులు అడుగుతావేం!. నమ్మతారు. ఇంటో అందర్ని లేపు తావ్రూ? అంతేనా. ఎవరికి తెలీదు? హా హా హా. టక్కరు వెధవా! తొరగా తీసుకురా తిండి. తాళం చవులుట. పొట్టలో పేగులు కొరుక్కు తింటోంది పెద్దపులి! తొరగా.

రంగ : ఈ చుక్క వంటిల్లు తాళం వెయ్యకుండా వుండ కూడదూ? ఎందుకా తాళం? పాపం ఈయునికి ఆలిస్య మాతోంది...... తమ్ముడూ నీకేం భయం లేదు. నేనూ మా చెల్లెలూ తప్ప ఎవరూ లేరు ఇంటో.

దొంగ-రంగదాసు వంక చూస్తున్నాడు.

దొం : సరేలే, నీమాట నిజ మనిపిస్తోంది. వెళ్ళి తీసుకురా. కాని నన్ను మోసం చేశావా, దేవుడితోడు, యీ

కత్తితో గుండెల్లో పొడుస్తాను. నేను తెగించినవాణ్ణి. నాకు పోయే దేంలేదు.

రంగ : వుంది.

దాం : ఏమిటి?

రంగ : నీ ఆత్మ! నా గుండెలకన్న అమూల్య మైన నీ ఆత్మ నాశనంకాదా తమ్ముడూ? చుక్కా! చుక్కా!

చుక్క: (గదిలోంచి) ఆ.

రంగ : ఓసారివొంటిల్లు తలుపుతీస్తావా! పాపం ఈయనెవరో చాలా ఆకలిపడి వొచ్చారు.

చుక్క: ( లోపల్నుంచి ) ఏమిటి? ఇంత రాత్రా! బాగానే వుంది. ఇంకనన్ను నిద్రపోనీయరా యేమిటి? వొచ్చే ప్రతి బైరాగి వాడికి తిండిపెట్టడంతో సరిపోతోంది నాపని. ( చుక్కమ్మ వొచ్చి కత్తి చూసింది. ) అన్నయ్యా! వాడిచేతిలో కత్తి యేమిటి?

రంగ : ఏంలేదు. మనకు కత్తిపీట వుందో లేదో అని కత్తి ముందే తెచ్చుకున్నాడు ఆయన! (నవ్వుతున్నాడు.)

చుక్క: అన్నయ్యా నాకు భయంగా వుంది. అడివి మృగం మల్లే అట్లా చూస్తాడేమిటి!

దాం : తొరగా! మీ మాటలు కాలా; తిండి పెడతారా? ఇద్దర్నీ చంప మంటారా?

రంగ : చుక్కా! తాళంచెవులిట్లా యిచ్చి నువ్వు వెళ్ళి పడుకో.

చుక్కమ్మ తాళాలిచ్చి వెడుతోంది. దొంగ ఆమెకి అడ్డంగా దూకాడు.

దొం : ఆగు. నేను వెళ్ళిందాకా నువ్విక్కడనే వుండు. కదలకు.

చుక్క: ఇదేమిటి?

రంగ : ఏం లేదు. మన అతిథి నువ్వు వడ్డిస్తేనేగాని భోజనం చెయ్యనంటున్నాడు. (చుక్కమ్మ వొచ్చివొడ్డిస్తోంది, ముందు పీట వేసింది.)

దొం : తొరగా తగలెయ్యి—నీపీటా నువ్వూను, జైలులో పీటవేసి వొడ్డిస్తారనుకున్నావా?

చుక్క: జైలా? జైలేమిటి?

దొం : (తింటో) ఏమిటది? బుద్ధిలేదూ? కిటికీతలుపులు అట్లా తెరచి వుంచుతారేం? ఎవరంటే వాళ్ళు లోపలికి దూకరూ? (లేచి మూసేస్తున్నాడు.)

రంగ : ఇష్టమున్నవాళ్ళు రావాలనే తెరచి వుంచుతాము.

తింటో అన్నం యిటూ అటూ చిమ్ముతున్నాడు.

చుక్క: అన్నం అట్లా చిమ్ముతావేమిటి!

రంగదాసు అన్నం వోగుచేస్తున్నాడు.

దొంగ: దొంగ లొస్తారని భయం లేదూ?

రంగ : భయ మెందుకు? పాపం!

దొం : జాలా? హ హ హ. బావుంది. జాలా! హ హ ఎవడివిరా నువ్వు!

రంగ : రంగడి దాసుణ్ణి.

దొం : హా హా హా, దాసుడివా! నీఅమ్మ...... నువ్వు దాసుడివా!

రంగ : చుక్కా, నువ్వు వెళ్ళి పడుకో. ఆయన నేమీ అనరులే.

చుక్క: వీడిదగ్గిర నిన్ను వొక్కణ్ణి వొదిలి వెడతానా?

దొం : వెళ్ళు. (చుక్కమ్మ వెళ్ళింది.)

దొం : దాసు-దాసుడివా-నువ్వు దాసుడివా ! నే నెవరో తెలుసునా నీకు!

రంగ : ఎవరివోగాని జీవితంలో చాలా కష్టాలు పడ్డావు పాపం!

దొం : కష్టా లనుభవించానా! కష్టాలా! దేవుడా! అనుభవించాను. ఒక కష్టమా! (తెప్పరిల్లి) కాని, అదంతా పూర్వజన్మంలో! నేనుయింకా మనిషిగా ఉన్నప్పుడు కష్టాలు. ఇప్పుడేమున్నాయి. నేను మనిషిని కాను ఇప్పుడు. ఇప్పుడు నేను అంకెని. నేను 121. పదేళ్ళ నించి నరకంలో కాపరం వున్నాను.

రంగ : చెప్పు నాతో, నరకం సంగతి.

దొం : ఎందుకు? పోలీసులతో చెప్పడానికా?

రంగ : ఛీ! నా కెందుకు? నేనెందుకు చెపుతాను?

దొం : నీ మాటలు నమ్మకం తోస్తున్నాయి, ఎందుకో?

రంగ : (దొంగ భుజంమీద చెయ్యేసి)నాతో చెప్పు, ఆ నరకానికి వెళ్ళకముందు సంగతి.

దొం : అది... చాలా కాలమయింది. మరిచిపోయినాను. మాకో చక్కని గుడిశ వుండేది. కప్పుమీద గుమ్మడి

పాదు. సాయంత్రం యెండ పచ్చని పెద్దపూలమీద పడితే యేదో గుండె పట్టుకునేది. నా భార్య... అవును (త్వరగా) అవును. జ్ఞాపకముంది. ఆ మెకిజబ్బు- ఆ- నా సుబ్బికి. చస్తోంద తిండిలేక. దొంగతనం చేశాను. తిండికోసం. (ఆగాడు) నన్ను పట్టుకున్నారు. ఏడ్చాను. బతిమాలాను, చెప్పాను. ఎన్నడూ లేంది ఎందుకు, దొంగిలించానో! వాళ్ళు నా మొహాన నవ్వారు. పదేళ్ళు-ఖైదు- అబద్ధం సాక్ష్యాలు-లేని దొంగతనాలు-కూనీలు కట్టారు. నరకంలో తోశారు. నన్ను జైలులో పెట్టిన రాత్రే చెప్పాడు జైలు జవాను- నా సుబ్బి చచ్చిపోయిందని. (కోపంగా యేడుస్తున్నాడు,) వాళ్ళ సంపతెగా, వాళ్ళునాశనం కానూ.

రంగ : ఏడవకు. తరవాత...

దొం : పూర్వం నేనూ మనిషినే. ఇప్పుడు ఆ జైలు బతుకుతో ఇప్పుడు పశువుని చేశారు వాళ్ళు. పశువులాగు గొలుసులతో కట్టారు. కుక్కని కొట్టినట్టు కొరడాలతో కొట్టారు. ముదుగు పెట్టారు తినడానికి. వొంటి నిండా పేలు. గోమార్లు. నేలమీద పడుకున్నాను. తిట్టేవాణ్ని. నన్ను బాదారు వాళ్ళు పగిలేట్టు. ఓడి మెడ విరిచా. ఎంత బలం నాకు! బలమంతా విరక్కొట్టారు. పదేళ్ళు... బాబూ పదేళ్ళు. నా పేరు తీశేశారు. మరిచిపోచేశారు. నా ఆత్మని తొలిచేశారు. దెయ్యాన్ని ప్రవేశపెట్టారు నాలో. ఓ రోజు మరిచి

పోయినారు కట్టడం. తప్పించుకున్నాను, నెలరన్నర యింది. అప్పణ్నించి భయం. కైదు తప్పించు కున్నా—కాని భయం... తిండి లేదు.

రంగ : లేదా?

దొం : అవును. లేదు. నరకంలో- కైదులకు తిండి, మురుగు తిండి ఏదో ఒకటి వేళకి పారేస్తారు. కాని తప్పించు కుని యీ చక్కని లోకంలోకి వొస్తే, తిండి దొరకదు. ప్రతిచోటా నా కోసం వెతుకుతున్నారు, తరుముతున్నారు. కూలిచేస్తానని అడగడానికి భయం. ముష్టి వెయ్యరు. మళ్ళీ దొంగిలించాను. వాళ్ళేగా నన్ను దొంగని చేసింది, వాళ్ళ దుంప తెగా!

రంగ : తమ్ముడూ చాలా బాధలు పడ్డావు. అధైర్యపడకు. కష్టాలు కాపరముండవు.

దొం : సుఖమా! నాకు సుఖమా? హా హా హా.

రంగ : చాలాదూరం నడిచి వొచ్చావు. అలిసినట్టున్నావు. ఆ పక్క మీద పడుకుని నిద్రపో. కప్పుకోడానికి శాలువ తెచ్చి పెడతాను.

దొం : ఎవరన్నా వొచ్చి చూస్తారేమో!

రంగ : ఎవరూ రారు. వొస్తే నేం? నువ్వు నా అతిథివి; స్నేహితుడివి; నీకేం భయం?

దొం : నేను... ...స్నేహితుణ్ణా! అదేమి మాట?

రంగ : అవును. నిన్నెవరూ ఏమీ చెయ్యరు. ఇప్పుడు సాధారణపు దాసుణ్ణే ఐనా పూర్వం నేను యీ వూళ్ళో మేస్త్రీటుపని చేశాను. నిన్నెవరూ ఏమీ చెయ్యరు.

దొం : దొంగల్ని కైదుకు పంపే మేస్త్రీటు స్నేహితున్నా నేను? బావుంది.

ఆ సమస్య అర్థంకాక తల గోక్కుంటున్నాడు.

రంగ : నీకు శాలువ తీసుకొస్తాను.

రంగదాసు వెళ్ళాడు. దొంగ లేచి తిరుగు తున్నాడు.

దొం : మేస్త్రీటు గారి స్నేహితున్నా! హాహాహా. (వెండి దేవ తార్చన పెట్టె చూస్తున్నాడు.) వెండిది లాగుందే బాబో! వెండిదే! ఎంత బరువు. బలేది దొరికింది. అమ్మకుంటే ... ...

రంగదాసు వొస్తున్నాడు. పెట్టెని వొదిలి సుంచున్నాడు, దొంగభయంతో వొణుకుతూ.

రంగ : నా దేవతార్చన పెట్టెనా చూసి ఆనందిస్తున్నావు. అది వొక్కటే నా ప్రాణం. నా రంగడి యిల్లు. మాఅమ్మయిచ్చిందినాకు, అదివొక్కటే మిగిలింది. ఈ బీదయింట్లో అంతఅందమైన పెట్టె వికృతంగానే వుంటుంది. అది కాశ్మీరములో వెయ్యి సంవత్సరాల క్రింద తయారు చేశారు. చాలా మహిమగలది. నా రంగడికి- రంగడికి (కళ్ళు నీళ్ళతో నిండాయి.) నివసించడానికి వీను అర్పిస్తేనేం? ... పడుకో.

దొం : పడుకుంటాను, పడుకుంటాను. (ఆలోచనగా) చూడు. నామీద యెందుకు దయ నీకు? కాక అంతా యిదో వేషమా? దొంగవు కాదు కద నువ్వు! నన్ను బుట్టలో వెయ్యాలని పన్నాగమా?

రంగ : సుఖంగా నిద్ర పో, తమ్ముడూ.

దొం : కాదులే. తెలిసింది లే నీ యెత్తు. నన్ను కూడా భక్తుణ్ణి చెయ్యాలని చూస్తున్నావు. అవునా? అవునా? నన్ను భక్తుణ్ణి చేస్తే నీ రంగడు నీమీద సంతోషిస్తాడని. ఏం? అన్నయ్యోయ్– ఆ ఆశ లేం పెట్టుకోకు. అదేం లాభం లేదయ్యోయ్. ఆ పప్పు యిక్కడ వుడకదు! రంగడా–వెధవ–రాక్షసి దేవుడా ... ఛూ——

రంగ: రంగడికి నిన్ను చూస్తే అపారమైన ప్రేమ, ఏం చేస్తావు పాపం! ఎట్లా తప్పించుకుంటావు!

దొం : ఓ ... నన్ను భక్తుణ్ణి చెయ్యాలనా? ఈ దొంగదయ యేమిటా అని మొదటనే అనుమాన పడ్డాను. వృథా శ్రమ నాయనా! నేనెవర్నో నీకు తెలీను దెయ్యాన్ని–పిశాచిని– రాక్షసిని.

రంగ : రాక్షసుల హృదయాల్లో మా రంగడే వెలుగుతున్నాడు. అడుగో!

దొం : నోరుముయ్యి. నీ పాడు రంగడి సంగతి కట్టిపెట్టు.

రంగ : పోనీలే. పొద్దుపోయింది పడుకో, తమ్ముడూ.

దొం : (గొణుగుతూ) పడుకుంటాలే. (మంచంమీద కూచుని) ఎవరూ రారుకదా?

రంగ : అంతభయమైతే లోపల గడియ వేసుకో! కాని గడియ వుందో లేదో చూడలేదు ... (చూస్తూ) ఆ వుంది లే.

దొం : గట్టిగా వుంటుందా గడియ! తాటాకులాగు వుంది ఆ తలుపు. ఒక్క తన్నుకి విరుగుతుంది. ఏం, గట్టితలుపులు పెట్టించుకో లేరూ! సరేలే. పడుకుంటాలే నువ్వు వెళ్లు.

రంగదాసు వెళ్ళాడు.

# మూడవ రంగం

దొంగలేచి తిరుగుతున్నాడు.

దొం : ఒక్క తలుపుకీ గొళ్ళాలూ గడియలూ లేవు. దిక్కుమాలిన యిల్లుగొరికింది. (అ ప్రయత్నంగా దేవతార్చన పెట్టె దగ్గరకు వెళ్ళి చూస్తున్నాడు.) ఎన్ని వందల ఖరీదు వుంటుందో. అమ్ముకుంటే... పాపం- ఆముసలోడు యీ పెట్టిలో తన ప్రాణా లున్నాయన్నాడు. వాడి అమ్మ యిచ్చిందట! వాడి అమ్మ! మాఅమ్మసంగతి యెవడూమాట్లాడడేం? మాఅమ్మ నాకేమిచ్చింది? నాకెవడు ఏమిచ్చాడు? లోకంలో ఎవడన్నా ఒక్కడుగాని! ఇతనొక్కడేకద నన్నుఆదరించి అన్నం పెట్టింది? కాని ఈదాసులకి మామూలే యిది- అన్నం పెట్టి ఆదరించడం. నా కోసమా? వాళ్ళకి పుణ్యం వొస్తుందని చేస్తారు ధర్మం. రంగా అంటారు. ప్రేమ చూపుతారు... ...ఒరేయ్ ఇదేమిట్రా ఇట్లా మెత్త పడి పోతున్నావూ! నిన్ను చూస్తే నీతోటి ఖైదీలు నవ్వరుట్రా! ఇంత చేతకాని వెధవ్వ అని! దేవతార్చన పెట్టి దొంగిలించడానికి నెం 121 సందేహిస్తున్నాడా! హ హ హ. అరే దేవుడా, బలే! నీ కీర్తి, నీసాహసం, నీబలం, యేమై నాయి! తమాషా! ఎందుకు సందేహించాలి! ఏడుస్తాడా? ఏడవనీ. నేనేడ్చినపుడు ఎవడు జాలిపడ్డాడు!

పెట్టె తెరచి విగ్రహాన్ని అక్కడే పారేసి, పెట్టె తీసుకుని బైటికి వెళ్ళి వెనక తలుపు వేశాడు. చప్పు డయింది.

చుక్క: (గదిలోంచి) ఎవరది? ఎవరంటే? ఈ రాత్రి నిద్రపో సీతా యేమిటి? ఎవరూ? (వొచ్చింది) ఎవరో తలుపు వేశారు......ఎవరూ లేరే! అయ్యో! దేవతార్చన! ఇదేమిటి! విగ్రహాన్ని ఇట్లాపారేశాడు! పెట్టె యేదీ? అన్నయ్యా, అన్నయ్యా, ఇట్లా రా, తొరగా! దొంగలు దొంగలు.

రంగదాసు వొచ్చాడు.

రంగ : ఏమిటి! ఏమిటి?

చుక్క: దొంగ! వాడూ — నీ దేవతార్చన పెట్టె ఎత్తుకు పోయినాడు.

రంగ : నా దేవతార్చనా!...... (విగ్రహాన్ని ఎత్తుతో) రంగా, రంగా, పడిపోయినావా? నిన్ను చలిలో పారేసి పోయినాడా? దెబ్బతగిలిందా, రంగా!

చుక్క: రంగడు సరేలే, పెట్టెపోయింది అనిచూడు.

రంగ : అన్యాయం. నేను...ఇంకేముంది?... నా రంగణ్ణి ఎక్కడ ప్రతిష్ఠించుకోను? లోకాలకి అధిపతి నా రంగడికి సరైన స్థలం లేదా? ఈపీట మీాద ఎట్లా వుంచను? నాపెట్టెని నారంగడి పెట్టెని తీసుకెళ్ళాడా? అది వొదల కూడదూ?

చుక్క: వెళ్ళు. పోలీసు వాళ్ళతో చెప్పు. ఆట్టేదూరం వెళ్ళి వుండడు. పక్క వాళ్ళని లేపుదాం, దొరుకుతాడు.

అట్లాంటికి వాణ్ణి ఇంట్లో పడుకో బెట్టినందుకు నీకు కావలిసిందే శాస్తి!

రంగ : చుక్కా! అవును నిజమే! నా తప్పే! దొంగలించే బుద్ధిపుట్టేట్టు యీ వెండి పెట్టెను యింట్లో వుంచు కోవడం నాతప్పే.

చుక్క: వూరుకో. వాడికి నువ్వాబుద్ధిపుట్టిచ్చింది? అదొంగకి, ఆతాగుబోతువాడికి! కన్నాలు వేసే ఘాతకుడు. వాడి మొహం చూస్తే తెలీలా! వెళ్ళి పోలీసు స్టేషన్లో చెప్పు.

రంగ : పోలీసులతోనా?

చుక్క: నువ్వు వెడతావా నేను చెప్పనా.

వెళ్ళబోతోంది.

రంగ : వుండు. పోలీసులతోనా? చెప్పి... అతన్ని మళ్ళీ జైలుకి పంపనా. (మృదువుగా) మళ్ళీ జైలుకా! వొద్దుచుక్కా! నాకు కావలసిన శిక్ష అయింది. నా కా పెట్టెమీద కాపీన మున్నందుకు సరైన ప్రాయ శ్చిత్తం జరిగింది. కాని అది నారంగడి పెట్టె—రంగా, భరించలేను నాకు చేతకాదు. (తనలో) అతన్ని ఏమీ చెయ్యకుండా నాపెట్టె నాకిప్పించరూ! కాని—అతనికో—పాపం యెన్ని బాధలు పడ్డాడు? ఏం చెయ్యను?

చేతుల్లో తల పెట్టుకున్నాడు.

చుక్క: అన్నయ్యా, నీదే తప్పు. ఏమన్నా అను, పోలీసులతో నువ్వు చెప్పక పోతే నేనే చెపుతాను. నువ్వు నా

అన్నవి, గొప్ప భక్తుడివి. కాని నీకు లోకమంటే తెలీదు. చంటిపిల్లవాడు నయం నీకన్న. ఈ వ్యవహారం నాకు వొదిలెయ్యి.

వెడుతోంది.

రంగ: వుండు చుక్కా! ఆగు. ఆపెట్టె నాదా; నీదా? నాదేనా? ఇప్పుడు అది అతనిది. నాకంటె ఆపెట్టె అతనికే ఎక్కువ అవసరం. అమ్మ వున్నా అతనికే యిమ్మనేది. రంగడే ఆపెట్టెని అతనికి ఇచ్చేశాడు.

చుక్క: కాదు——

—— ... ——

## నా లు గ వ రం గం

పోలీసులు లోపలికి వచ్చారు. వెంట దొంగని తీసుకొచ్చారు.

చుక్క: దొంగ వెధవా, అమ్మా! పట్టుకున్నార్రా నిన్ను! మంచిపని జరిగింది.

పోలీసులు : గోడ్డుపక్కన చీకట్లో పరుగెత్తుతున్నాడు యీ దొంగ వెధవ! అనుమానంమీద పట్టుకుంటే... ఎంత బలం వీడికి, ఎట్లా తన్నాడో చూడండి. ఓ పట్టాన చిక్కాడా! యీ పెట్టె కిందపడ్డది వాడి చేతుల్లోంచి- (చుక్కమ్మ పెట్టెతీసుకొని కావిలించుకుంది.) మేము పెట్టెని గుర్తుపట్టి తీసుకొచ్చాము యిక్కడికి. తీసుకు పదండిరా—

దాసూ దొంగా మొదటినుంచీ ఒకరినొకరు కళ్ళల్లోకి చూసుకుంటున్నారు.

రంగ : ఎందుకు? ఎందుకు పట్టుకున్నారు యితన్ని! ఇతనేం చేశాడు? నా స్నేహితుడు!

పోలీ : స్నేహితుడా? తమ స్నేహితుడా, వీడు!

రంగ : అవును, నాయనా, ఇందాకేగా నాతో భోజనం చేశాడు! అదుగో అక్కడే! వెళ్ళేప్పుడు నేనే ఇచ్చాను ఆ పెట్టెని అతనికి.

పోలీ : తమరే యిచ్చారా? తమ రంగస్వామి పెట్టెని ఇచ్చేశారా?

రంగ : దానిమీద అతనికి చాలా మనస్సయింది. వొదిలేసి వెళ్ళండి ఆయన్ని.

పోలీ : కాని—అయ్యా క్షమించండి... మాకు అనుమానంగా

వుంది. ఇతను వూరు పేరూ చెప్పడు. ఎక్కడ ఏం చేసి వొచ్చాడో!

రంగ : నా స్నేహితు డనలేదూ? ఇంకెందుకు ఆ ప్రశ్నలు?

పోలీ : అవునులెండి... కాని...

రంగ : ఇంకచాలు, వెళ్ళండి.

పోలీసులు మెల్లగా విధిలేక వెళ్ళిపోయినారు.

దొం : (నెమ్మదిగా కలతో మల్లే) ఆ పెట్టె నా కిచ్చానని చెప్పి నన్ను తప్పించావా? ఎందుకు?

చుక్క: ఒరే, దొంగముండాకొడకా! అర్ధరాత్రి నీకు తలుపు తీసి, తిండిపెట్టి, మర్యాదచేసి, పడుకోపెడితే, దొంగ తనం చేస్తావురా, ఘాతకుడా!

రంగ : చుక్కా, వెళ్ళి పడుకో.

చుక్క: ఏమిటి? నేనుపోను—నిన్ని నరహంతకుడితో వొదిలి వెళ్ళను ఏమన్నా అను, ఈ సారి నిన్ను నరికి మరీ పోతాడు.

రంగ : చుక్కా, వెళ్లు. ఏమీ భయంలేదు.

చుక్క: సరేలే—పొమ్మంటే పోతానులే.

వెడుతోంది.

రంగ : చుక్కా! రంగడిపెట్టె యిట్టా యిచ్చి వెళ్ళు.

చుక్క: ఇయ్యను, నిన్ను చంపి యెత్తుకుపోతాడు వాడు, నే నియ్యను.

రంగ : ఇయ్యి. నేను ఆజ్ఞాపిస్తున్నాను.

యిచ్చి కోపంగా వెళ్ళింది.

దాం : (మొహం వేళ్ళాడేసి) మీసొమ్ము నిప్పుతో సమాన మండి. దేవుడిదయవల్ల పెట్టె నెత్తుకుపోకుండా బతికాను. నాకెంతో సంతోషంగా వుంది.

రంగ : పడుకుని నిద్రపో.

దాం : నిద్రా! (పెట్టెవంక చూస్తో) నేను నిలవ నిక్కడ. నాకు భయమేస్తోంది. నేను వెళ్ళి పోతాను. నేను తప్పించుకు మాయమౌతాను.

రంగ : పాపం! దాక్కోవలసిన గతి పట్టిందా నీకు! ఏం చెయ్యను.

దాం : లోకంలో మంచితనమూ, దయా వున్నాయని నమ్మడం మానేశాను నేను. జైల్లో పడ్డాడా, ఎవడికీ మనుషుల్లో విశ్వాసం నిలవదు. కాని ఎట్లానో తెలీదు, ఎందుకో మీలో కరుణ కనపడుతోంది. నాకే, నావంటి ఘాతకుడికే సిగ్గేస్తోంది? ఈ దాసుణ్ణి ఆశీర్వదించండి.

రంగ : రంగా! రంగా! నాయనా సుఖీభవ!

దాం : (మాట్లాడబోయి కన్నీళ్ళతో) అయ్యా శలవు.

వెళ్ళబోతున్నాడు.

రంగ : ఇదుగో! నీ పెట్టె మరిచిపోయినావు.

ఇచ్చాడు.

దాం : ఇదేమిటి?

రంగ : ఈ పొంతను పడిపో. ఎవరికీ కనపడవు. అటు ఎందుకు వెళ్ళావు? నన్నడిగ కూడదూ?

దాం : అయ్యా! నమస్కారం. నేను ... నేను ... (ఏడుస్తున్నాడు) నేను శుద్ధ వెధవని, మూర్ఖుణ్ణి. ఏడుస్తున్నాను. కాని ... ... ఏమిటో ... ఎట్లాగో ... నేను మృగాన్ని కానని ... మనిషి నేనని ... జ్ఞాపకం వచ్చేట్టు చేశారు. నాకు ... నాకు కూడా—కొంత ధైర్యం, ఆశ, విశ్వాసం అన్నీ కలిగేట్టు చేశారు.

రంగ : తమ్ముడూ ... ఈ సంగతి యెప్పుడూ జ్ఞాపకం వుంచుకో. ఈ శరీరం, ఇది నిరంతరం వెలిగే పరంజ్యోతికి నిలయం.

దాం : (భయంతో) ఆ! పరంజ్యోతికి నిలయం ... జ్ఞాపకముంచుకుంటాను!

వెడుతున్నాడు.

రంగ : రంగా! రంగా!

(తెర)

# ఏం జబ్బు?

పాత్రలు:

సీతారామయ్య — తండ్రి

కుటుంబరావు — అన్న

శాంత — ఆమె

శ్యామలరావు — భర్త

సుబ్బయ్య — మామ

కామమ్మ — అత్త

డాక్టరు.

## ఒకటో రంగం

సుబ్బయ్య: ఒరే! అబ్బాయీ, అబ్బాయీ! ఏం చేస్తోందిరా, ఆ పాడుముండ?

శ్యామలరావు: (లోపలినించి) అట్లానే మూలుగుతోంది.

సుబ్బ: ఆ పిశాచపుపిల్ల మన కొంప దాపరించింది?

కామ: గతన్నమంటి కుర్రాణ్ణి దీనికి కట్టిపెట్టాము కద! ఎంతసేపు అట్లా కూచుంటావు ఇటు రా. (లోపల మూలుగు) మూలుగు, మూలుగు! మూలిగి మూలిగి అట్లానే చావు. చస్తే, మా వాడికి వేరే పెళ్ళిన్నా చేసుకొంటాను.

సుబ్బ: పోనీ, ఏం జబ్బో, కొంపముంచుతుందేమో, డాక్టర్ని ఓసారి తీసుకొచ్చి చూపిద్దామా!

కామ: చాల్లే వూరుకోండి. ఎవరన్నా నవ్వుతారు. మొన్న మంగమ్మగారి యింటికి వొచ్చి రెండు నిమిషాలు తనిఖీ చేసిందో లేదో, మూడురూపాయలిమ్మంటట ఆ డాక్టరుముండ. ఆ ఆవాలపట్టుకి ఖర్చయిన అణాగాక పైగా ఇదోఖర్చా! చావనీండి. చస్తేనేం?

సుబ్బ: మనం చంపామని ఆ తండ్రి వెధవ, గోలచేస్తా డేమో!

కామ: ఏం? మనం చంపామా? అనమనండి మొహం పగలతంతాను... సంబంధం తెచ్చిన ఆ వెంకటేశ్వర్లు అట్లానే పోయి చచ్చాడు కద! చివరికి అయిదు వందలు కట్నం యిస్తే చాలునన్నాడు. ఈ మొద్దుని తక్షణం పుట్టింటికి తరిమేవాళ్ళం—వెధవమూలుగూ యిదీని. ఇది చస్తేగాని మనవాడికి అదృష్టం తిరగదు.

సుబ్బ: నిజమే. ఇది గడపతొక్కిన నాటినించి దరిద్రమే కదా! శేరుపాలు యిచ్చే ఆవు పుటుక్కున చచ్చింది.

కామ: ఆవేమిటి? ఆ బీరువా అద్దం అరణాలదీ పగిలిపో లేదూ!

లోపల మూలుగు.

సుబ్బ: మనవాడు బి. యల్. పాసుచేసినా దమ్మిడీ గిట్టక పోయెను. ఎక్కడ చూపరించిందో మన అదృష్టం కొద్దీ! డిస్ట్రిక్టు కలెక్టరు కూతురనీ, ఆరువేలు కట్న మిచ్చారనీ చూసుకున్నాముగాని... ...

కామ: ఏం చూసుకోడంలేండి? మరి ఆ పొలం సగమూ రాసి యివ్వడేం?...

సుబ్బ : ఏమిటి, బండీ యేదో ఆగింది. ఎవరో చూడు.

కామమ్మ చూసివొచ్చింది.

కామ : వాళ్ళే, వాళ్ళే. ఇంకెవరు? దాని అబ్బా, అన్నా. కనపర్చకండి. లోపల కాలుపెట్ట నీకండి. మీరే మాత్రం మెత్తపడవొద్దు—పడ్డారా—

శీతారామయ్య, కుటుంబరావూ వొచ్చారు.

(కామమ్మ లోపలికి వెడుతో జాలిగా) మనవాడు పొద్దుణ్ణించి కోడలు పక్కదగ్గిరే కూచునివున్నాడుగా. రారా! ఇంకెంత సేపు సేవచేస్తావు?

వెళ్ళింది.

శీతా : బావగారూ, నమస్కారాలు.

సుబ్బ : ఏమండి? ఇట్లా దయచేశారు?

శీతా : (ఆదుర్దాగా) ఏదీ, శాంత, ఏదీ? ఎట్లావుంది దానికి? శాంతా, అమ్మాయీ, శాంతా!

సుబ్బ : ఆగండి. లోపలికి వెళ్ళడానికి వీల్లేదు.

కుటుం: ఏం!

సుబ్బ : వీల్లేదు, అంతే.

శీతా : ఎట్లా వుంది? బతికి వుందా!

కామ (: లోపల్నించి) చచ్చింది.

శీతా : శాంతా, శాంతా, అమ్మాయీ!

లోపల్నించి 'నాన్నా! నాన్నా!' అంటో శాంత పరుగెత్తుకుని వొచ్చింది. వెనకాలే శాంతని లాగుతో కామమ్మ.

కామ : పో, లోపలికి పో!

శాంత: నాన్నా! నాన్నా! వచ్చావా నాన్నా; అన్నయ్యా, నువ్వొచ్చావా !

శీతా : మా అమ్మ ! అమ్మా ! బతికివున్నావా ? మళ్ళీ నిన్ను కళ్ళతో చూస్తా ననుకోలేదే ! నిజంగా నువ్వేనా !

లోపల్నించి శ్యామలరావు వొచ్చాడు.

శ్యామ: ఏమండీ ! మామగారూ !

కామ : చూస్తావేంరా ! తీసుకుపో — లోపలికి తీసుకుపో దాన్ని !

శ్యామ: పద.

శాంతని లాక్కెడుతున్నాడు.

శాంత : నాన్నా ! నాన్నా ! వెళ్ళిపోకే ! వెళ్ళకేం! నువ్వెడితే నేనింక చచ్చిపోతాను. నీకు కనపడను.

కుటుం: నాన్నా, నేనింక వూరుకోను. ఇట్లా జరుగుతుందని ఇదివరకే చెప్పాను నీకు. ఇంక వూరుకోను.

శీతా : నాయనా, శాంతం—బావగారూ? ఏమిటండి యీ అల్లరి !

కామ : అల్లరిట ! మనదట, అల్లరి. ఇంటో జొరబడి, పైగా మనదిట అల్లరి !

సుబ్బ : అల్లరేముందీ !

శీతా : అమ్మాయిని ఎందుకు చూడనీరు !

సుబ్బ : అసలు మీరెందుకు వొచ్చారు !

కుటుం: రాకూడదా! మా పిల్లని చూడటానికి మేం రాకూడదా ?

కామ : ఇంకోళ్ళచేతుల్లో పెట్టింతరవాత, ఇంకా మీ పిల్ల యేమిటి ?

శీతా : జబ్బుగావుందని చూడ్డానికి వొచ్చాం, తప్పా!

కామ : అది దొంగవుత్తరాలుకూడా రాస్తోందీ ?

కుటుం: తండ్రికి రాయడం, దొంగవుత్తరమా ?

శీతా : లేదండీ, ఆ నరహరిరావుగారి భార్య వ్రాసింది; 'మీ పిల్లకి జబ్బుగావుంది చూసివెళ్ళమని.'

కామ: ఆ రత్తమ్మముండకి అదేంపోయేరోగం! దొడ్లోంచి కనపడనీ, మొహాన పేణ్ణీళ్ళు చల్లుతాను.

శీతా : నాకింద శిరద్దాయి చేశాడయ్యాను, అంత మాత్రం విశ్వాసం వుండదా!... మరిజబ్బుగా లేదంటారా!

సుబ్బ: వుంటే! మేం చూచుకోలేమా!

శీతా : మాపిల్లని చూడనీరేం!

కామ: మాకివ్వవలసిన ఆరువేలూ యివ్వరేం!

శీతా : ఆరువేలా!

సుబ్బ: మీరు కార్యం రోజున యిస్తాననలేమా ?

శీతా : యిస్తానన్నానా ?

సుబ్బ: అన లేదూ ?

కుటుం: మళ్ళీ అదే గోల నాన్నా! అనలేదని వీళ్ళతో వాదించి ఏం లాభం! ఎన్నిసార్లయిందికాదు !

శీతా : ఆరువేలు!

కామ: ఆరువేలు! ఎగేసేప్పుడు ఆరువేలుగా కనపళ్ళేదూ?

కుటుం: రా. పోదాం. ఈThugs తో ఏంలాభం మాట్లాడి?

శాంత: (లోపల్నించి) నానా్నా, నానా్నా!

శ్యా: (లోపల) ఈసారి అరిచావా, గొంతు పిసుకుతాను.

కుటుం: రా, నానా్నా.

శీతా: ఎట్లా రానురా అబ్బాయీ! పోనీ యిది చెప్పండి. ఏం జబ్బుదానికి?

సుబ్బ: ఏం రోగామో!

కామ: మీ కూతురు నాజూకు రోగాలు మాకేం అర్థమౌతాయి?

శీతా: డాక్టరేమన్నాడు?

కామ: డాక్టర్లకి పోసేందుకు యిక్కడ డబ్బుదాచపెట్టారా?

శీతా: యిస్తా. నేనిచ్చి తెచ్చుకుంటా.

కుటుం: ఏమిటి? ఈ రెండు నెలనించీ డాక్టరుకే చూపలేదు? ఎందుకు నానా్నా, యీ రాక్షసులతో మాట్లాడతావూ?

సుబ్బ: మాటలు సరిగారానీ, లేకపోతే, బైటికి నడు.

శ్యామలరావు వొచ్చాడు.

శ్యామ: ఏమిటి, వాగుతున్నాడు, బావ గాడ్డెకొడుకు?

కుటుం: ఊ!!!

శీతా: నేను పోయి డాక్టర్ని తీసుకురానా?

కామ: వీల్లేదు.

శీతా: ఏం?

కామ: ముందు నూ ఆగు వేలూ యిచ్చండి. (కొడుకుతో) ఆ ముండని వొదిలి వొచ్చావేం? పరుగెత్తుకొస్తుంది.

శ్యామ: మంచానికి కట్టేసి వొచ్చాను.

కుటుం: నానాన్న. 'సుకుమారంగా పూలలో పెట్టి పెంచాను కూతుర్ని. ఆనాడు పొరపాటున లక్ష్మి అద్దాన్ని శాంతి కాలు మీద వేసిందని, దాన్ని వెళ్ళగొట్టావే, యీనాడు నీకళ్ళముందే యిదంతా యెట్లా సహిస్తున్నావో! ఈ కిరాతకురాలు...

శీతా: ఏంచెయ్యను నాయనా!

కుటుం: నువ్వు ఏమీ చెయ్యకపోతే, చూడు, నేను—

అమాంతం శ్యామలరావుని పట్టుకుని తంతున్నాడు.

శీతా: వుండు, వుండు.

కామ: ఆ... ఆ...

సుబ్బ: ఓరి నీదుంప తెగా!

అడ్డంవచ్చిన కామమ్మకీ, సుబ్బయ్యకీ రెండు తగలనిచ్చాడు.

సుబ్బ: పిలవరా, పిలవరా పోలీసుల్ని!

కుటుం: పిలవండి వాళ్ళే విచారిస్తారు న్యాయం—

శీతా: అవును పిలవండి, ఇన్‌స్పెక్టరు మన భావనారాయణేగా! నేనే వెంట తీసుకొద్దామనుకున్నాను. వాళ్ళెందుకు—నువ్వే పిలవరా.

శ్యామలరావు బేరానికి వచ్చాడు.

శ్యామ: ఇంతకీ ఏమంటారండీ.

శీతా: ఏమంటాం? మా అమ్మాయిని చూడని—

కుటుం: కాదు, మాతో పంపమంటాం.

శ్యామ: మరి ఆసంగతి చెప్పరేం? తీసుకుపొండి. పొండి మా అభ్యంతర మేముందీ?

కామ: అంతే, మళ్ళీ తీసుకురాకండి.

శీతా: చూశావా? నే చెప్ప లేదురా అబ్బాయీ, అసలు వ్యవహారం పాడు చేస్తావని!

కుటుం: తీసుకొద్దాం. వల్ల కాదంటే అప్పుడు మళ్ళీ తంతాను.

శ్యామ: తంతో ఎన్నాళ్ళుంటావిక్కడ? నువ్వేనా తన్నేది?

శీతా: ఏమీ వొద్దు. అమ్మాయిని డాక్టరుకి చూపసేండి. చాలు.

కామ: మూడు వేలు తెండి.

కుటుం: మూడు వేల తన్నులిస్తాను. ఏంరా, బావగా, ఏమంటావు? డాక్టర్ని చూడనిస్తావా లేదా?

తన్నడానికి సిద్ధమౌతున్నాడు.

శ్యామ: చూడనియ్యవే, చూడనీ. పోయిందేమిటి?

సుబ్బు: ఖర్చంతా మీందే!

—•••—

## రెండో రంగం

అదే స్థలం. ఓగంట తర్వాత.

సుబ్బయ్యా, శ్యామలరావూ, కుటుంబ
రావూ, శీతారామయ్య కూచునివున్నారు.

సుబ్బ: ఏమీ లేదండీ—— అదేమిటో, వొచ్చినప్పణ్ణించీ ఒకటే మూలుగు దానికి, ఒక్క మూలుగేమిటి, మీ పిల్ల మా గుమ్మంలో కాలు పెట్టి నప్పణ్ణించి మా సంగతంతా అట్లానే వుందిలెండి!

శీతా: మా యింటో ఒక్కసారి చిర్రున చీది యెరగదు. ఎంతో దృఢమైన పిల్ల. మరి——

శ్యామ: ఐతే ఇంక మాఖర్మ మనుకోవాలి.

శీతా: మీకేం మహారాజులు, ఇదంతా మాఖర్మం, దాని ఖర్మం.

డాక్టరు మాధవరావు తువ్వాలతో చేతులు
తుడుచు కుంటూ లోపల్నించి వచ్చాడు.

మాధవరావు: రెండు నెలల నుంచి జబ్బుగా వుగదంటోంది ఆ అమ్మాయి. ఏం, శ్యామలరావ్, క్లబ్బులోననా్న నాతో ఒక్కమాట అనా్నవు కావు!

శ్యామ: Old fools నేను డాక్టర్ని పిలుస్తా నంటే ఏవో వైద్యాలు చేస్తామంటారు. వారంరోజుల కిందట ఆస్పత్రిదాకా వొచ్చాను కూడాను.

మాధ: అంతటితో నీబాధ్యత తీరిం దనుకునా్నవు. అవును, ఆడదాని కయ్యేను జబ్బు! చాకిరి చెయ్య కండా

మూల పడిందాకా, ఎవరికీ అట్టే పట్టదు. వంటకి యిబ్బంది ఐనప్పుడు అప్పుడూ వైద్యం మొదలు.

శ్యామ: కాదండీ—— పనితొందర-చూడండి.

మాధ: మొన్న కాల్లో ముల్లుతీయించు కోడానికి ఆస్పత్రికి వొచ్చావా! మూడుగంటలు నర్సుతో బాతాఖానీ వెయ్యడానికి తీరుబడి బాగానేవుందే! ఆ అమ్మాయి రెండు నెలలనించి ఆమంటల్ని యెట్లా వోర్చుకుందో యేమో పాపం—— వొళ్ళంతా తినేసిందే ఆరోగం.

సుబ్బ: అయినా కూతురు వొంటి సంగతి తలిదండ్రులు చూచుకోవాలి గాని——

మాధ: కూతురు ఆరోగ్యం వాళ్ళదీ, అనుభవం మనదీ!

శీతా: ఏం జబ్బండీ.

మాధ: (జవాబు తప్పించుకుంటో) మందు పంపుతాను. మంత్రసాని వొస్తుంది.

శీతా: మంత్రసానీ!

మాధ: ఆ ఆశ లేదులెండి. ఇంక జన్మానికే వుండకోలేదు!

సుబ్బ: యిదో దుర్గుణం కూడానా? గొడ్రాలు మాకెందుకు?

శీతా: జబ్బు సంగతి చెప్పారు కాదు.

మాధ: మందు పంపిస్తాను కదూ.

శీతా: మరి ఏమి అపాయం లేదుకదా. డాక్టర్, మీ కస్మాల్షి విసిగిస్తున్నాను గాపును కాని ఆపిల్లమీదనే నా పంచ ప్రాణాలు పెట్టుకున్నాను.

మాధ: ఏమీ పరవాలేదు. ఆదుర్దా పడకండి.

శీతా: యేమీ అపాయం లేదు కద!

మాధ: సరిగా treatment తీసుకుంటే, ఏమీ అపాయం వుండదు.

డాక్టర్ వెడుతున్నాడు. కుటుంబరావు అడ్డం నించున్నాడు.

కుటుం: ఒక్క నిమిషం వుండండి. మీకు భయపడి వూరుకున్నాడు గాని ఏం జబ్బో తెలిసిందాకా ఆ ముసలాయన ప్రాణం ఆగదు. ఇదివరకు ఎప్పుడూ జబ్బు లేని పిల్ల వీళ్ళ యింటికి వచ్చిన యీ రెండు నెలల నించీ యిట్లా ఎందుకు మంచ మెక్కిందా అని మా సందేహం.

సుబ్బ: అంటే! మే మేమన్నా మందు పెట్టా మేమోనని వీరి సందేహ మండి.

మాధ: మందు పెట్టలేదుగాని... శ్యామలరావు! సీతతో మాట్లాడాలి యివాళ- ఆవిక కనపడు.
(శీతారామయ్యతో) పోనీ, మీ అమ్మాయిని కొన్నాళ్ళు పుట్టింటికి తీసికొని వెళ్ళండి.

శీతా: అంతకంటేనా?

సుబ్బ: ఎందుకండీ!

మాధ: ఇక్కడ వుంటే ఆ జబ్బు వొస్తూనే వుంటుంది.

సుబ్బ: ఏమండీ, ఎందుకండీ మీకు కూడా అంత ఆగ్రహం మా మీద!

శ్యామ: పోనిద్దూ నాన్నా!

సుబ్బ: వుండు ఈసంగతేదో కనుక్కోవాలి. దోవలో మన మీాద బాగా నూరిపోసి నట్టున్నారు.

మాధ: ఆపిల్లకి అంటు జాడ్యం.

శీతా: క్షయ కాదుకదా!

సుబ్బ: ఆ అంటుజాడ్యాలు ఆవూళ్ళోలేవు కాబోలు. మా యింటోనే! ఏం పెట్టారయ్యా మీాకు పీళ్ళు!

మాధ: ! (కోపంవచ్చి) ఇంకెందుకు? గనేరియా!

కుటుం: మాటలు సరిగా రానీండి, పీళ్ళ చేతుల్లో పడ్డదికదా అని మీాకూ లోకువైనట్టుంది మాశాంత, ఏమండీ, మేము బోగమువాళ్ళ మనుకున్నారా? అది పరాయి మగవాడితో సావాసం చేసిందనేగా మీాఉద్దేశ్యం?

డాక్టర్ ఆశ్చర్యపడి చూస్తున్నాడు. తక్కిన వాళ్ళు ఆయన్ని మాటాడ నియ్యరు.

సుబ్బ: (డాక్టర్‌తో) అట్లా బుద్ధిచెప్పండి. నిజంమాట్లాడారు. అయ్యా! అమ్మా! ఇట్లాంటి పాడు రోగం పిల్లనా మాకు అంటగట్టారు బాబు! ఏదీ ఆముండని ఈ దృకురారా కనుక్కుందాం.

కుటుం: అబద్ధం. సర్వాబద్ధం. ఏండాక్టర్! మేమెవర మనుకుం టున్నావో- ఈయన రిటైర్డు డిప్టీ కలెక్టరు.

శామ: చూస్తారేం! తరమండి దాన్ని యింటోంచి. తర మండి ఇట్లాంటి లంజని.

శాంత లోపల్నించి వొచ్చింది.

శాంత: ఏమిటి నాన్నా! ఏంచేశాను నేను! ఏమిటి వీళ్ళు అంటున్నారు! ఎందుకు అట్లా దిగులుపడతావు?

శీతా: ఛీ, ఛీ, నన్ను తాకకు పో. పో.

మాధ: నన్ను మాటాడని స్త్రీనా!

కుటుం: చెప్పు. ఎందుకు మా చెల్లెల్ని తిట్టావు?

మాధ: మీ చెల్లెలికి రోగంగా వుందనడం తిట్టడమా? రోగంగా లేకపోతే నన్నెందుకు పిలిచారు! రోగం తెచ్చుకోవడం బాగా సేస్తుంది. నేను అనగా తప్పా వొచ్చిందీ!

శాంత: నేనేం తెచ్చుకున్నాను?

కుటుం: అదుగో అదేమాట! తెచ్చుకుం దంటావు? చిల్లర మనిషా—

మాధ: రోగాలు మనుష్యుల గొప్పతనాన్ని పట్టేనా? అందరికీ వొస్తాయి!

కుటుం: ఇట్లాంటి రోగం!

మాధ: ఎట్లాంటి రోగం! రోగాలలో భేదాలేమి? ఇది మర్యాదస్తుల రోగమే! ఈ వూళ్లో మర్యాదస్తుల పేర్లు చెప్పనా, యీ రోగం వున్నవాళ్ళవి!

సుబ్బ: మర్యాదస్తులకి ఎందుకు వొస్తుంది? దిక్కుమాలిన ముండలకే దాపరిస్తుంది! అప్పటికీ పెద్దమనిషైన నాలుగురోజులకే కార్యం చేశాము. ఇంటో వెయ్యి కళ్ళతో కనిపెట్టివున్నాం. మరి యీ లోపల ఏ గొట్టా కొంపముంచిందో తెలీదు.

కామ : రణజిత్తులమారి ముండగాని ! సామాన్యురాలా !

మాధ: మీా కొక్కరికీ యేమీా తెలిసినట్టు లేదు. మళ్ళీ గొప్ప చదువులు చదువుకున్నారు. కావలసినన్ని యేళ్ళొచ్చాయి. ఈ రోగానికి దుర్నడత ఉండనక్ఖ్లేదు. భార్యనించి భర్తకీ, భర్తనించి భార్యకీ రావొచ్చు.

కుటుం: ఓహో ! అట్లానా ? తెలిసింది. బాగా చెప్పారండి.

కామ : ఏమండోయ్, డాక్టరుగారూ, మాటలు సరిగా రానీండి, జాగ్రత్త. మా అబ్బాయివల్ల వొచ్చిందంటున్నారా ? మీాకేం మతిపోయిందా ?

మాధ: శ్యామలరావు, అందుకే నేను నిన్ను ముందు పరీక్ష చెయ్యాలన్నాను.

కుటుం: అవునండి, నిజం మాట్లాడారు. మీావంటి డాక్టర్లు పదిమంది వుంటేచాలు యీా దేశానికి,

శ్యామ: నాకెందుకు పరీక్ష ? నేను వొప్పుకోను.

మాధ: సరే నీయిష్టం, నేను వెడుతున్నాను.

సుబ్బ : ఏమండోయ్ వెడుతున్నారు గాని ! ఎవరితోనన్నా మావాడిమీాద అబద్ధాలు వాగేరు !

మాధ: ఏం, మీా అబ్బాయికి వుండకూడదూ ? అబద్ధం యేముంది ?

సుబ్బ : మీాకేం తెలుసు-వుందని ? జాగ్రత్త. మంచివాళ్ళం కాదు.

శ్యామ: మాధవరావ్. చూసుకో, కోర్టుకీడుస్తాను, ఒక్క మాట మాట్లాడావంటే.

పోస్టుజవాను వొచ్చాడు.

పోస్టుజవాను: శ్యామలరావుగారూ, బంగీ వొచ్చింది.

మాధ: అదేదో మందులాగుందే! ఏదీ గనోకిల్లర్—ఓహో ఇది మీ కెందుకండోయ్.

శ్యామ: ఎవరు పంపేరు? నే నెరగనే!

కుటుం: ఆహా! ఇది దానికే మందుకదూ! ఏమీ ఎరగవులే! ఏదీ! వాళ్ళు వ్రాసిన ఉత్తరం చదవనీ.

ఉత్తరం లాక్కొని చదువుతున్నాడు.

శ్యామ: పోస్టుమాన్. వెళ్ళు-వెళ్ళుమంటు. నీకు బుద్ధిలేదు. అందరం మాట్లాడుతూవుంటే వొస్తావా?

సుబ్బ: ఏముంది! దీని కోసమే! పెళ్ళాం బాధ పడుతూవుంటే చూడలేక తెప్పించాడు.

శ్యామ: అవు నవును. మరిచిపోయినాను.

మాధ: ఆ రోగమేదో తెలీదన్నారు?

సుబ్బ: తెలీకేం! తెలుసు, దాని కోసమే.

మాధ: ఇంకా అబద్ధాలు మాట్లాడి ఏం ప్రయోజనం?

సుబ్బ: కాకపోతే, మా అమ్మాయికీ ఆ మందెందుకు, గడప దాటని వాడికి! ఏమో, యీ అమ్మాయి వల్లనే.

కుటుం: నోరుముయ్యి. చంపేస్తా ఆమాట అన్నావంటే.

పోస్టు: గడప దాట కేమండీ— మా వీధిని నాగరత్నం

లేదూ! దానియింటికి వస్తారు కదండీ ఈయన! అది
రోగాల పుట్ట.

శ్యామ: అతె అం——

పోస్టుజవాను పరుగెత్తాడు.

మాధ: ఇంక నేను వెడతాను. శ్యామలరావ్, ఇంక అబద్ధాలు
మాని సరిగా వచ్చి మందు తీసుకో. నీవొంటి సంగతి
సరే. ఆ అమ్మాయి బాధనాన్నా నయంకావాలి.
ఏమెరుగని పిల్ల! కాని ఏమి లాభం మందిచ్చి -
మనుష్యులు అలవాట్లు మానుకుంటే తప్ప!

వెడుతున్నాడు.

సుబ్బ: అయ్యా! డాక్టరుగారూ! ఒక్క మాటండి. ఆ పోస్టు
వాడు వుత్త పోకిరి వెధవ. మా అబ్బాయి మామూలు
ఇవ్వలేదని కోపం. వాడి మాటలు నమ్మి, ఎక్కడనాన్నా
మళ్ళీ అనేరు.

మాధ: నే నెందుకంటాను! మీ అబ్బాయి కోర్టుకు లాగుతా
నన్నాడుగా! ఆ భయం లేదు నాకు. వాళ్ళు వీళ్ళు
అన్న మాటలు నమ్ముతానా! ఆ నాగరత్నాన్నే
పిలిపించి కనుక్కుని రూఢి అయిన తరవాతే మాట్లా
డతాను.

సుబ్బ: అదో దొంగముండ. అన్నీ అబద్ధాలు. అట్లాంటి
పోకిరివాళ్లు నిజం మాట్లాడతారా.

మాధ: ఆ నాగరత్నం సంగతి చాలా తెలిసినట్టుందే మీకు!

సుబ్బ: తెలీద మెందుకు! మర్యాదస్తుల పేరు చెడగొట్టడ
మంటే, ప్రతివాళ్ళకీ చులకన.

మాధ: మర్యాదస్తులంటే, దాచుకునే వాళ్ళూ, పోకిరీలంటే
బైటపడేవాళ్ళూ. అంతేనా మీ అర్థం!

సుబ్బ: ఆ అర్థాలేమీ నాకు తెలీవు కాని, అయ్యా! మీ
కెందుకీ గోల? మా బాధలు మమ్మల్ని పడనీయండి.

మాధ: నన్ను పిలుచుకొచ్చి, అడ్డమైన మాటలూ అన్నా
రుగా మరి!

సుబ్బ: ఇవి చేతులు కావు, కాళ్ళు. ముసలివాణ్ణి బతిమాలు
కొంటున్నాను. ఆగ్రహించకండి.

మాధ: సరేలెండి నాకేం ఆగ్రహం! రండి సీతారామయ్య
గారూ, మందు యిప్పిస్తాను.

శాంత: నాన్నా వెళ్ళిపోతావా?

సీతా: మందు తీసుకొస్తాను.

## షూడవరంగం

రెండునెలల తరువాత. ఆస్పత్రిలో.

మాధ: ఎప్పుడూ రావడం!

శీతారామయ్య : నిన్నా! రెండు నెలలైనా ఆ అమ్మాయికి ఏమీ నెమ్మది కనిపించలేదే!

మాధ: నేనేం చెయ్యను? మీ అల్లుడుగారు మళ్ళీ మళ్ళీ రోగం తెచ్చి పెడుతోవుంటే! పిల్లకి విశ్రాంతి నివ్వ వయ్యా అంటే వినడూ!

శీతా : అతనికోసం కూడా ఇన్‌జక్షన్లకి డబ్బిచ్చానుగా!

మాధ: ఏం లాభం, ఆయనకి కుదర్చి! నాగరికత్వానికి ఎవరు కుదురుస్తారు? దానికికూడా ఇన్‌జక్షన్లకి డబ్బిస్తారా? పూరివాళ్ళకంతా కుదిరితేగా దానికి కుదిరేది?

శీతా : బాగావుంది, ఏమిటి సాధనం?

కుటుం : వాడితల పగలగొట్టడం.

మాధ: అందుకేగా ఆ పిల్లని తీసుకెళ్ళమని చెప్పాను.

కుటుం: తీసుకువెడితే మళ్ళీ పిల్లని రానియ్యరు వాళ్ళు. వాళ్ళు దాన్ని ఏమోంకపెట్టి చంపేస్తారని అని ఈయన బెంగ. పెళ్ళినాటినుంచి ప్రతి అట్టుకీ ప్రతి రోజూ బెదిరించి మాదగ్గర ఎంతడబ్బు లాగారో చెప్పలేము. దాన్ని పెడుతున్న హింస కళ్ళారా చూశాను. దానితోడమీద కాల్చారండి! ఈ లోకంలో యెవరూ యిట్లాంటి క్రూరత్వాన్ని శిక్షించేట్టు లేరు.

శీతా : ఏం లాభం కోర్టులో పెట్టి? దాని కాపరానికేగా నష్టం!

కుటుం: నిజంగా యమలోకమనేది వుంటే బావుండును! కాగే నూనెలో పారేస్తే మాత్రం, తగినశిక్ష అవుతుందా! ఆ లోకపు భయాలూ పోయినాయి యీనాటివాళ్ళకి.

మాధ: మీకు కర్మలో నమ్మకం పోయినట్టే!

శీతా : ఎప్పుడో వాళ్ళు మాడితే మాత్రం, ఇప్పుడు మన పిల్లకి ఏం లాభం?

మాధ: చూసేప్పుడే మంచి సంబంధం చూసి చేసుకోవాలి.

శీతా : ఎట్లా తెలుస్తుంది? చదువుకున్నాడు. ఆస్తివుంది, మంచి వంశం—ఒక్కరూ చెప్పలేదు యిట్లాంటి వాళ్ళు అని.

కుటుం: దాని యేడుపుచూస్తే దాన్ని చంపెయ్యడం చాలా దయగల కార్యమనిపిస్తోందే...తీసుకుపోదాం నాన్నా యేమన్నా కానీ, నా యింటో వుంటుంది.

శీతా : దాని సుగాడుగతి! తల్లిలేని పిల్ల! దానికి పదమూడే శ్ళండి, దానిబుద్ధి యెప్పుడూ యిట్లానే వుంటుందా?

కుటుం: ఉండకపోతే పోయిందిలే, ఏమన్నా కానీ.

శీతా : ఏదన్నా అపరిదిష్ట వొస్తే—

కుటు : రానీ.

శీతా : నీకేం? రానీ అంటావు. నేనొకణ్ణి బతికివున్నానుగా యింకా! డిప్టీకలెక్టరు శీతారామయ్య కూతురు...

కుటుం: నీకీర్తి నిర్మలంగా వెలిగేందుకు, నీ కూతుర్ని కటిక

వాళ్ళకి నొప్పచెప్పావు. దానివొంటో గంపెడు చెప్పరాని రోగం ప్రవేశపెట్టి, నెలలనించీ విశ్రాంతి లేని బాధలో కాలుస్తున్నావు. నీపేరు మండిపోనూ! వాళ్ళనికాదు నిన్ను తన్నాలి. నీ మొహం చూడ్డం పాతకం. నీ కూతుర్ని కిరాతకులకి నొప్పచెప్పావా; నేనుకూడా యీ జన్మలో నీమొహం చూడను. నీ ప్రతిష్ఠా నువ్వూ చిరకాలం బతకండి.

మాధ: ఆగ్రహపడకండి. చాలాసార్లు భర్తని వొదిలిన ఆడపిల్లల చరిత్రలు చూస్తే, ఎంత నరకంగా వున్నా, భర్తయింట్లో పడివుండడమే తెలివైన పనేమో అనిపిస్తుంది. ప్రతిష్టసంగతి కాదు. ముందు వాళ్ళు పడబొయ్యే బాధలు.

కుటుం: ఇంత కన్నానా? ఇప్పుడు వూరిముండ లందరి రోగాలూ వొంటో భరించడంకన్న యింకా పాడౌతుందా? వాడు—ఆ కటికవాడు, దానికాలిదుమ్ము తలమీద వేసుకోడానికి పనికి మాలిన— నీచుడు, వాడి పక్కలో పడుకోడం కన్న, బలవంతంగా వాడితో ...... ఇంకా పాడౌతుందా నాచెల్లెలు యీలోకంలో!

మాధ: ఇప్పుడిట్లానే అంటారు లెండి కుర్రతనంలో; కాని మీకే నలభై యేళ్ళొచ్చి, నలుగురు ఆడపిల్లలు పుట్టారంటే, మీ భార్య యీ రంకు ముండని ఇంటోంచి తరమమని మూర్ఖపుపట్టుపట్టి కూచుంటే అప్పుడు తెలుస్తుంది. ఏం తలవంపులు! హేళనలు,

వెఱ్ఱి! యీ చెల్లెలు యింట్లో యెక్కడ దాపురించిందా అనుకుంటావు. ఒకవేళ చెల్లెలు ప్రవర్తన బావున్నా, మీ భార్యకీ యీమెకీ తగాదాలు - చాకిరీలు-

శీతా: అట్లా చెప్పండి బుద్ధి!

కుటుం: నేనెన్నటికీ అనుకోను. ప్రాణమిస్తాను, నా శాంత కోసం.

మాధ: అవును కాని, మీ చెల్లెలి వయసెంత?

శీతా: పదమూడేళ్లు.

మాధ: మరి భర్త యిష్టం లేనిదే ఎట్లా తీసికెడతారు?

కుటుం: వాడి యిష్టమేమిటి? వాడెందుకు యిష్టపడతాడు?

మాధ: భర్త యిష్టం లేని పిల్లను తీసికెడితే రెండేళ్లు కైదు-

కుటుం: తండ్రి - అన్న -

మాధ: పెండ్లి అయిన తరవాత తండ్రేమరు, అన్న యెవరు?

కుటుం: అబద్ధం.

శీతా: అయనెందుకు నేను చెబుతున్నానుగా! అంతే.

కుటుం: ఇదేం లా? ఇదేం దేశం! ఇంతవిపరీతం వుంటుందా? ఏమిటి? నా చెల్లెల్ని - వాళ్లు చిత్రవధ చేస్తోవుంటే,

మాధ: మరి తీసుకు వెడతారా? అది చెప్పండి.

కుటుం: ఇదేం దేశం? ఇదేం లా?

మాధ: ప్రాణమిస్తానన్నారుగా మీ చెల్లెలి కోసం! కైదుకు వెళ్ళటం ఓ లెఖ్ఖా! ఏదో తేల్చండి. ఇదేం దేశం, ఇదేం లా అంటారెందుకు?

కుటుం: దాన్ని రక్షిస్తే నాకు క్రైదా? దాన్ని వాతలు పెట్టినందుకు వాడికి క్రైము లేదూ? ఆరోగాలు ప్రవేశ పెట్టినందుకు —? అరుస్తున్న గొడ్డుకి మందులు పోస్తారు. దానికి మందివ్వించనందుకు శిక్ష లేదూ? అది చచ్చినా దాన్ని చంపినా? రక్షించినందుకు నాకు ఖైదా? మీరూ మీ లా గోదావరిలో పడండి.

మాధ: తీసుకొస్తారా? అది చెప్పండి. నేనెక్కడపడేదీ నేను చూసుకుంటాను.

సుబ్బయ్యా, కామమ్మా ఏడుస్తూవచ్చారు.

కామ: శాంతమ్మ శాంతమ్మో! డాక్టరు గారూ, మా కోడలు కొంప తీసిందండోయ్!

సుబ్బ: రత్నంవంటి పిల్ల వెళ్ళిపోయిందండోయ్!

మాధ:
కుటుం: } ఏమిటి? ఏమిటి?
శీతా:

కామ: కిరసనాయిలుపోసుకుని కాల్చుకుంది. కాలిపోయింది. మాయింటి లక్ష్మి అస్తమించింది.

సుబ్బ: ఇంతా యిల్లంటుకుంది కాదు.

కామ: పక్కనవున్న అంగవస్త్రం సగం తగలబడ్డదయ్యా.

కుటుం: పోయిందీ?

శీతా: అయ్యో కూతురూ?

సుబ్బ: అయిపోయిందయ్యా!

కుటుం: శాంతా, శాంతా!

మాధ: ఆమే కాల్చుకుందా? ఆమంతట ఆమేనా? అనుమానమే!

శీతా: పదండి చూద్దాం. అనుమానమే!

కుటు: పిలవండి పోలీసుల్ని. పదండి... తెలీడంలేదునాన్నా! నిన్న మూడువేలూ ఇచ్చావుగా! ఇంకేం? ఇంక పిల్ల యెందుకు వీళ్ళకి? వేరే పెళ్ళిచేసి మళ్ళీ కట్నాలూ కానుకలూ...

శీతా: పద, పద, అయ్యో!

సుబ్బ: అది చచ్చికూడా మనకొంప తీసేట్టుందే!

కామమ్మ: పోలీసులెందుకు? రద్దితప్పు! చచ్చిన మీ పిల్ల మళ్ళీ వొస్తుందా యేమన్నానా?

సుబ్బ: దానిఖర్మం అట్లా రాసివుంటే మనమేం చేస్తామండి బావగారూ!

— ••• —

# పంకజం

## ప్రథమ రంగం

రాత్రి పొంటిగంట. అలంకరించిన శోభనపు గది. దాంట్లోంచి యింట్లోకి వెనకాల తలుపు, బయటికి ప్రత్యేకంగా తలుపూ. మధుసూధనరావు, పంకజమూ సోఫామీద కూచున్నారు. ఆమెకు పదహారేళ్ళు. తెలివిగల మొహం, మధుసూధనరావు చదువుకున్నవాడి మల్లే కనబడుతున్నాడు.

పంకజం : (విసుక్కొంటూ) యెంజా గాల మిట్లా మనుష్యుల్ని గదుల్లో బంధించి వుంచడం ప్రాసిక్యూషన్ చెయ్య వలసిన విషయం.

మధుసూధనరావు : ఎంతమంది — యిట్లాంటి బంధసం యెప్పుడు లభిస్తుందా అని ఉవ్విళ్ళూరేది!

విసురుతున్నాడు.

పంక : వీరూ అంతేగా!

నవ్వుతోంది.

మధు : ఆహారసుని యూ అమ్మాయిని పట్టుకుని విధిలేక వొప్పుకున్నా. ఇప్పటికే యెవరిని చూసినా నేనుమాత్రం యిల్లా రావడం మహా మొక్కి కష్టంగా వుంది. దీని పేరు తలుచుకుంటేనే నాకు పరమ అసహ్యం, గర్భాదానంట! యీ శరీర సంబంధాన్ని యింత గొప్ప చేస్తారు. మళ్ళీ ఆధ్యాత్మిక దేశంట యిది. వుండవలసింది ఆత్మకీ ఆత్మకే వున్నతమైన ప్రేమబంధం.

పంక : అట్లా అయితే దేహం మట్లో వున్నా కురూపిఅయినా, చెడిపోయినా, ఆ ప్రేమ పోదుకదూ!

మధు : ఎందుకు పోతుంది? వీళ్ళందరికి సాధారణంగా ఆ ప్రేమ ఎటువంటిదో తెలీనే తెలీదు.

పంక : అవును అదే నిజమైన ప్రేమ. నిజంగా నామీద అంత ప్రేమ వుందా మీకు? ఇదివరకెవరినన్నా యిట్లా ప్రేమించారా?

మధు : ఛీ! కాని ఒకటి. ఇప్పుడే నీతో చెప్పకపోతే నేను విశ్వాసిని కాదు. నాలుగేళ్ళక్రితం ఒకరాత్రల్లా ఒక కాపు పిల్లతో వున్నా. అది నా ఆత్మ నంటలేదు. నీవు నొచ్చుకున్నావా?

పంక : లేదు. మీ హృదయం నాదేగా?

మధుసూధనరావు లేచి బయటికి తలుపుదగ్గిర కెళుతూ,

మధు : సందేహమా? మీయిల్లింత వూరిబయటేం? నువ్వూ మీ అమ్మ వొక్కళ్ళూ వుంటారు, భయంకదూ?

పంక : మాదగ్గిర యేమీలేదని అందరికీ తెలుసు.

మధుసూదనరావు బయటికి వెళ్ళాడు. పంకజం అట్లానే చూచుని వుంది. రెండు నిముషాల్లో ఆ తలుపులోంచి వెనకాలే దొంగవచ్చి పంకజం నోట్లో గుడ్డలు కుక్కేడు. రెండో దొంగ మధుసూదన రావుని రెక్కలు విరిచికట్టి చేతితో కత్తి సిద్ధంగా పట్టుకొని లోపలికి తీసుకొచ్చాడు.

రెండోదొంగ : మెల్లిగా (మధుసూదన రావుతో). అరిస్తే పొడిచి పారిపోతా. కూకో.

మధుసూదనరావు కదలకుండా కూచున్నాడు. పంకజం పెనుగులాడి ప్రేమతో ఆతనివేపు పరుగెత్తింది. మెదటిదొంగ ఆమెను, లాక్కెళ్ళి మంచంమీద పడేసి, కావిలించుకొన్నాడు. తన్నుకొని లేచింది. చంపుతానని కత్తి చూపించాడు. పంకజం భయపడక తోసేసింది.

రె.దొ: (మొదటిదొంగతో) అట్టాకాదురా (మెల్లిగా పంకజంతో) మంచంమీద తొంగో — లేకపోతే యీణ్ణి పొడిసేస్తా.

పంకజం ఆట్లానే నుంచుంది. మధుసూదనరావు వొణుకుతున్నాడు.

(మధుసూదనరావుతో) నువ్వు చెప్పు! అన్యాయంగా చస్తావు. అరవకు!

మధు : (మెల్లిగా పంకజంతో) ఏం చేస్తాం? ప్రాణాలకన్న యెక్కువా యేం?

రె.దొ : (మధుసూదనరావుతో) తొరగా! సంపుతా!

మధు : (దొంగతో) నేనేం చెయ్యను? దాన్ని యిద్దరూ కలిసి పట్టుకోండి

రె.దొ : అట్టాకాదు—దానికి సావుభయంలేదు. నీకుంది. కానీ చెప్పు.

మధు : (పంకజంతో) నామీద యిదేనా ప్రేమ? నన్నిట్లా చంపిస్తావా? ... ... నీకాళ్ళమీద పడతా! బతికున్నన్నాళ్ళూ—

రె.దొ : ఇంక ఆగకు!

కత్తెత్తుతున్నాడు.

మధు : అయ్యో! అయ్యో!
పంక : మీకోసం.

యేడుస్తో పక్కమీద పడ్డది. ఆమెని దొంగ కావిలించు కున్నాడు. ఆమె పెనుగులాడకుండా వూరుకొంది.

## రెండో రంగం

అదేగది. తెల్లారి నాలుగు గంటలు. గదంతా అన్నీ గల్లంతుగా పడి వున్నాయి. మధుసూదనరావు ఆ కట్ల తోటే సోఫా నానుకుని నిద్ర పోతున్నాడు. పంకజం మంచం దిగుతోంది. జుట్టు చీదరగా పడ్డది. చీరె చిరిగింది. జాకెట్టు రవికా లేవు. పెదిమ నించి నెత్తురు కారుతోంది. మధు సూదనరావు దగ్గిర కెళ్ళి కట్టు విప్పు తోంది. యెక్కి యెక్కి యేడుస్తోంది. మధుసూధనరావు కళ్ళు విప్పాడు.

పంకజం: అయ్యో; నా మధూ, నామధూ, నెప్పా! రా త్రంతా యెట్లాభరించారు! బతికివున్నామా ఇంకా! మీ కళ్ళు గుందే ...... అయ్యో యెంత బాధ పడ్డారో !

మధు : (చివాలున లేచి) ఛీ, ఛీ నన్ను తాకకు !

తోసేశాడు.

పంక : యేమిటి! ఎందుకు! నేనే, అయ్యో మీకు ఈ అవస్థ తో మతి భ్రమ కలిగింది! ఎంత అవస్థ వొచ్చిందండీ మీకు. (కావిలించు కుంటోంది)

మధు : (పంకజాన్ని గోడమీదికి తోసి) ఛా ఛా వాళ్ళు... పో పో నాకళ్ళముందు వుండకు. ఇంక నాకూ నీకూ సంబంధమేమిటి?

పంక : అయ్యో! నేనేం చేశాను? నా ప్రేమంతా–

మధు : ఎందుకా ప్రేమ–తగలెయ్యను?

పంక : శరీరాన్నేగా... ...

మధు : ఛీ ఛీ పో యింకా మాటాడతావు సిగ్గులేక?—

వెళ్ళబోతున్నాడు.

పంక : అయ్యో, నేనేమైపోను? నేనేం చేశా? మీ దాసిగా పడివుణ్ణాండి. నాకు మీరుగాక దిక్కేమిటి? మళ్ళీ పెళ్ళి చేసుకోండి. కాని నన్నో...

మధు: నిన్నేం చేసుకోను? వంట చేయటాని కన్నా పనికి రావు. పో. పో.

పంక : (యేడుస్తో) మీ కాళ్ళమీద పడతా: మీ యిల్లు వూడుస్తో బతకనీండి.

మధు: ఛీ, ఛీ లోకమంతా యేమంటారు?

వెడుతున్నాడు.

పంక : నేనేమి చేశాను? నా తప్పేముంది?

మధు: నీ ఖర్మం, నీ గీత.

వెళ్ళాడు.

## మూడో రంగం

సంవత్సరమయింది. రాత్రి తొమ్మిది గంటలు. ఇదివరకటి గదే. గోడకు చిన్నదీపం వెలుగుతోంది. ఒకమూల పాత నవారుమంచం, దానిపక్కన వెదురుపేళ్ళ వుయ్యాలతొట్టి. దానిపైన తాడుకి రెండు విరిగిన చిలకలు వేళ్ళాడుతున్నాయి. రెండు నెలల బిడ్డ వాటివేపు చేతులు చాచి అరుస్తోంది. పంకజం మంచంమీద కూచుని ఆనందంలో ఆ బిడ్డకేసి చూస్తోంది. పంకజం మాసిపోయిన రవిక వేసుకుంది.

పంక : ఉళ్ళళ్ళాయీ

చిలకల్లు చెలరేగి జీడికొమ్మెక్కూ-
అబ్బాయి చెలరేగి గొన్న బుజమెక్కూ-
ఉళ్ళళ్ళాయీ
మందార ధారుడే మరి మీనాన్నా
మాటిమాటికి వొచ్చి మరి చంక పెట్టు.

హాయ్, ఇంకా నిద్దరాదు. ఆ పాత చిలకల్ని చూసి ఏం మాట్లాడు కుంటావమ్మా! మంచివి ఎవరిస్తారు నీ మొహానికి.

ఉళ్ళళ్ళాయీ
చాల మామడిపళ్ళు దూరానగలవు
జోడించి తేరమ్మ అబ్బాయి మామల్లు.

నీకు మామలే! మామలు నిన్ను తాకితే వాళ్ళవాళ్ళ గోత్రాలు కుళ్ళిపోతాయి. నీ మొహం చూస్తే వాళ్ళకి నరకప్రాప్తి. పోనీలే. నా చిన్ని నాన్నా!

నీకు అమ్మున్నాదిగా, ఇంకెవరూ వొద్దు. నా నగలన్నా అమ్మి నీకు బొమ్మలూ, పట్టుచొక్కాలూ కుట్టించాలంటే అన్నీ లాగుక్కున్నారు. పోనీలే. నేనున్నా, చాలదూ. అను. చాలు నను. ఇట్లా చూడు. నా చిన్న నాన్నకి, నా వరాల కుప్పకి అమ్మ తప్ప యింకేమీ అక్కర్లేదు. (ఎత్తుకు ముద్దాడు తోంది) నా నాన్న. నా బాబు, నా ప్రాణం.

గుమ్మంలో మధుసూదనరావు వొచ్చి నుంచున్నాడు. పట్టంచు పంచా, సిల్కుకోటూ, పట్టుజరీకండువా, వెండిపొన్ను బెత్తం, తాంబూలం, అత్తరువాసన, చాలా షోకుగా వున్నాడు. పంకజం తలెత్తి చూసింది. మొహములో సంతోషంవొచ్చి వెంటనే మాయమయింది.

మధు : (దగ్గరకొచ్చి చిరునవ్వుతో) నేను వొస్తే యిదేనా యేమిటికి పలకరించడం?

పంక : ఎందుకొచ్చారు?

మధు : ఎందుకొస్తా?

పంకజం లేచి నిలుచున్నది.

మధు : యేం మాట్లాడవేం?

పంక : యేం మాట్లాడను.

మధు: నేనొస్తే మాట్లాడ్డానికేం లేదూ? నేను లేకపోయినా హాయిగానే వున్నట్లున్నావే? మాట్లాడవేం? నీతో మాట్లాడ్డానికే వచ్చా.

పంక : సరే చెప్పండి.

మధు : మనం మాట్లాడినంత సేపు (పిల్ల కేసి చూపించి) మీ అమ్మకన్నా వొదినకన్నా యివ్వరాదూ!

పంక : వాళ్ళెవ్వరూ దీన్ని ముట్టుకోరు.

మధు : అట్లను ఎందుకు ముట్టుకోంటారు? వాళ్ళకి సిగ్గూ అభిమానమూ లేవూ?

పంక : సరే కాని—పచ్చినపని కానివ్వండి.

మధు : అయిపోయిం దేదో అయిపోయింది. నిన్ను తీసుకెళ్ళడానికి వొచ్చాను......మాట్లాడవేం? అయితే ఒకషరతు. యీ పిల్ల మనతో వుండడానికి వీల్లేదు.

పంక : ఏం?

మధు : ఇద్దరము చెన్నపట్నము వెళ్ళి యెవరికీ తెలియకుండా మిషనరీలకిచ్చి వొచ్చేద్దాం.

పంక: నేనందు కొప్పుకో పోతే.

మధు: వొప్పుకు తీరాలి యెవరికోసం వొప్పుకుంటావు ?

పంక: సరే. వొప్పుకు తీరాలి గాని యిప్పుడెందుకు అకస్మాత్తుగా నామీద యీదయ?

మధు: తరోవాని కేంలే; కానీ చెప్పు.

పంక : నిర్హేతుకంగా నామీద యింత దయ వొచ్చిందేం?

మధు: ఏమీలేదు. నీమీద జాలీ వేసి——

పంక: ఓహో! జాలే! నిజంగా!

మధు: ఈ వేళాకోళాలు చాలించు. ఎప్పుడు ప్రయాణం?

పంక: నేనొస్తా నన్నానా?

మధు: రావూ? యేం? యింకెవరికన్నా...

పంక: ఈ షరతులన్నీ పెట్టుకుంటూ నాగాళ్ళ మీద పడి వేడుకుంటే మాత్రం నిన్ను నాగోరుకి తాకనిస్తానా? వెళ్ళు. ఎవరు నువ్వు?

మధు: (వెకిలి నవ్వుతో) ఏమిటి? యింత కసే? మరచిపోలా? కావిలించుకోబోతున్నాడు.

పంక: (తప్పించుకుని) ఆగు అక్కడే, (బిగ్గరగా అరుస్తో) ఊఁ, నడు, ముందికెక్కడ్నించి? నా ప్రాణాన్ని, నా బంగారాన్ని, మిషసరీల కిస్తాట్ట. యెందుకు? యెందుకియ్యాలి? యింత నా మీద ప్రేమ వుంది కదూ పాపం నీకు! నీకోసమేనా? వెళ్ళిపో ముందు పో.

పంకజం తల్లి సీతమ్మ వచ్చింది.

సీత : ఇదేమిటి? యేమిటిది పంకజం?

మధు: మీ అమ్మాయికి పిచ్చిపట్టింది. పాపమని తీసుకువెళ్ళడానికి నేనువొస్తే యెట్లా అరుస్తోందో చూడండి. దీని మీద మోహపడే వచ్చాననుకుంటోంది. దీని బతుక్కేడి! మళ్ళా పెళ్ళికి ప్రయత్నం చేస్తే అందరూ దాన్ని కూడా పాటకి నేస్తారని అనుమానం పడ్డారు. అందుకని వొచ్చాను. ఇన్నాళ్ళో ఎక్కడ ఉంటని, జరిగింది చెప్పి వుంచాను. ఇంకేం మనకు? అడిగిన వాళ్ళతో చెప్పేస్తా. నాకేం?

సీత : (పంకజంతో) నీకేం పిచ్చెత్తే? అందరితో చెప్పుతాట్ట. కొంప మునుగుతుంది. నాకు పాలి వస్తుంది మధు. పో, ఆయనతో.

పంక : ఛీ ఛీ, వాడితోనా?

సీత : వాడేమిటి? పెనిమిటిని పట్టుకొని అట్లా అంటావు? పాపం! ధర్మరాజు ఆయన. అన్నీ మర్చిపోయి నీ కోసం——

పంక : నా పెనిమిటా? యెవరు నా పెనిమిటి? వీడా నా పెనిమిటి? నా మానాన్ని, నా దేహాన్ని, తన పాడు చచ్చు, పిరికి ప్రాణం కోసం, తన కళ్ళెదట ఇంకోళ్ళ కిచ్చి బతికి, నేను తనకి పనికి రావని పోయిన వీడు, వీడు నా పెనిమిటా? ఈ ఆడంగి, పిరికిపంద, ఎందుకూ కొరగానివాడు నా దైవమా? వీణ్ణి కట్టేసి, వీడి ముందే నన్ను లాక్కుని, తనదాన్ని చేసుకున్న వాడు నా పాప తండ్రి అతనూ నాభర్త. అతని వితంతువుని నేను. ఇంకోణ్ణి నామీద చెయ్యి వెయ్య నిస్తానా? పెళ్ళి పీటల మీద చతికిలబడి మంత్రాలు విన్నంత మాత్రాన యీ చేత గాని——

సీత : చాల్లే పంచాంగం! నీమతి పోయింది. నడు, ఈపాటికి యింటోంచి నడు. నా పరువూ కులమూ నిలబడాలా?

పంక: సరే!

సీత : దానికోసం, ఆ బ్రహ్మ రాక్షసికోసం, ఆ వినాశపు పిల్ల కోసం, తల్లినీ, సంసారాన్నీ వొదులు కొంటారా?

పంక: తల్లినినేను పిల్లని వొదులుకోనా?

సీత : తండ్రి లేకుండా పుట్టిన పిల్ల పాప ఖర్మపు పిల్ల!

పంక: అందుకనే, నేను కూడా వొదిలెయ్యనా?

సీత : దిక్కుమాలిన దానవై చస్తావు.

పంక: పోనీలే, దాన్ని దిక్కులేని దాన్నిగా చేసి చంపను. అది కాకపోతే నాకు లోకమింకేమున్నది? నా బిడ్డ కంటే— నేనుతప్ప గతిలేని నా బిడ్డకంటే— మీ రెక్కువా నాకు? నా ప్రేమంతా, నా ప్రాణమంతా, దీని మీదనే వుంది. కొంచెం నా పాప తండ్రి మీద వుంది.

చీకట్లో పాపనెత్తుకొని వెళ్ళిపోయింది.

— • • • —

# వీ ర మ్మ

## ఒ క టో ర ం గ ం

రాత్రి యెనిమిదిగంటలు. ఇంటిముందు చీకట్లోనుంచుని చిట్టెయ్య.

చిట్టెయ్య: అమ్మా, మాధాకమళమండీ!

ఇంటోంచి వీరమ్మ.

వీరమ్మ: వెళ్లు, వెళ్ళు, ఇంటో ఎవరూ లేరు.

చిట్టె : ఉండే లేరంటా వేమమ్మా!

వీర : ఒహో! ముష్టివాళ్ళకి ఎంత పొగరువొచ్చింది? లేరని చెపితే పోరాదూ!

చిట్టె : పోయి... ఈ ఆకలీ...

అతని కంఠం విని అనుమానిస్తోంది.

వీర : ఎవర్రా నువ్వు? (బైటికివొచ్చి అతన్ని చూస్తోంది) ఇదేమిటి? చిట్టెయ్య! నువ్విట్టా వొచ్చావేమిటి?

చిట్టె : నువ్వు! వీరమ్మా! ఇక్కడ యెట్లా వున్నావు?

వీర : వీళ్ళఇంటో వంటకి కుదిరాను.

చిట్టె : నీకోసం యింటి దగ్గిర ఆ ముసలివాళ్ళిద్దరూ యేడ్చి చస్తున్నారు.

వీర : యాడవనీ! నేను వుండి ఏంలాభం? వాళ్ళకేమన్నా తిండి పెట్టగలిగానా, యేమన్నానా? పైగా నా కడుపో బరువు. నాసంగతి సరేగాని— నువ్వేమిటి?

చిట్టె : ఏముందీ? నిన్ను యింటిపట్టునుంచి తరిమిన కరువే, నన్నూ తీసుకొచ్చింది. నీకు ఈవంటపని దొరికింది—

నాకు యే పనీ దొరకలేదు. మూడు రోజు లైంది యెంగిలిపడి. ఏమున్నా పెడతారా వీళ్ళు ?

వీర : యింటో లేరు.

చిట్టి : యేమీ లేదా ?

వీర : అన్నీ తాళాలేసుకెళ్ళారు. ఎంత అనుమానమనీ !

చిట్టి : నీకు తిండి ?

వీర : సినిమాకి వెళ్ళారు. వచ్చితీస్తారు.

చిట్టి : ఒక్క ఆమేనా ?

వీర : పనిమిటిటిట, ఒకాయన వున్నాడు.

చిట్టి : కాదా !

వీర : ఆమెతప్ప ఇంకెవరూ అవునన రు.

చిట్టి : పని చేస్తానంటే పని చెప్పరుగద ! ఏదో తూర్పున బంగారమేరుకు తినవొచ్చనాన్రు. తూర్పు యిట్టా మండి పోతోంది.

వీర : ఇద్దామంటే, నాదగ్గిరా కాసీకూడా లేదే !

చిట్టి : జీతం లేదా ?

వీర : అదీ వాళ్ళ దగ్గిరే దాచారు. ఎప్పుడో వెళ్ళేప్పుడిస్తా రట. అణాఅడిగినా 'నీకెందుకు యిప్పుడు' అంటారు.

చిట్టి : జాగ్రత్త. చివరికి ఏమీయివ్వక పొమ్మంటారు. ఈ వున్నవాళ్ళకి వున్న కాపీనం యెవరికీ వుండదు... పొద్దున్న కాస్తయితే ఒకణ్ణి చంపేవాణ్ణే. మూడు రోజులయింది, ఒక్కరవ్వ నోట్లోకి పోయి. జాము పొద్దెక్కింది. ప్రతి యింటో తెల్లగా పొగలు లేస్తు

నాన్నాయి, పోయిన్నాయింది. ప్రతి పొట్టకీ తలకొరవు తుంది బువ్వా, కూరలు, పప్పూ, నెయ్యీ, పెరుగూ. నాకు ఒక్క గుప్పెడు తిండి లేదు. వాళ్ళందరూ ఎందుకు తినాలి! నేనెందుకు మాడాలి, అదీ చెప్పు? ఒక్కణ్ణి, ఒక్కకానీ యిమ్మన్నాను. చాటలో పుచ్చిన వేరుశనగలు చెరుగు తున్నాడు. పోనీ, అవీ పెట్టనన్నాడు. "వెధవా, వాళ్ళు కొవ్వీ... నీకు ధర్మమా? పోతావా, నీ మొహాన సిళ్ళు కొట్టనా?" అంటూ మీదకొచ్చాడు. కసికొద్దీ, నేను చూస్తూ వుండగా, ఆ కాయలన్నీ బురద కాలవలో పార వేశాడు. 'ఓరి ...... కొడకా,' అని మీదికి దూకాను. కాస్తైతే, చంపేద్దును ...కొడుకుని.

వీర : ఆయన వొచ్చే వేళయింది. నువ్వుపో! చూచారా, వెయ్యి ప్రశ్న లేసి ప్రాణం తోడుకు తింటారు.

చిట్టి : ఏం లేదా?

పోతున్నాడు. వీరమ్మ చూస్తోసుంచుని మనసు వొప్పక వెనక్కిపిలిచింది.

వీర : ఇంకో జాము తాళిరా, ఆవెనక సందులో దొడ్డి తలుపు దగ్గిరికి. ఏమన్నా దాచి వుంచుతాను నీ కోసం.

చిట్టి : సరేలే. అందాకా ప్రాణంనిలిస్తే....

# రెండో రంగం

రాత్రి పది. దొడ్లో చిట్టెయ్య తింటున్నాడు. వీరమ్మ అతనిదగ్గిరనుంచునివుంది, భయంతోఇంటివైపుచూస్తో.

చిట్టె : వున్నాడా ?

వీర : పడుకున్నాడు.

చిట్టె : అదీ ?

వీర : ఇంకా రాలేదు.

చిట్టె : కడుపులో వెతుకు పడేప్పటికి కళ్ళు పీక్కు పోతున్నాయి. అదృష్టవంతులు రోజూ తింటారు, ఆ పప్పూ, వుల్లిపాయ పులుసూ. చేపల కూరా. తిన డానికి కావలసి నంత వుంటే, ఇంకేం కావాలి లోకంలో ...... నీకూ పెడతారుగా! అదృష్ట వంతురాలివి.

వీర : మంచి అదృష్టమే! నీకేం తెలుసు! అసలు తిండి కళ్ళకు కనపడక పోతే అదో బాధ. కనపడి, బాగా వుండి, ఆవాసనలన్నీ తగిలి, తయారు చేసింతరువాత —నీ నోటిముందు కూడు—అంతా తినేసి, నీకేమీా మిగల్చక పోతే అదో బాధ. నీచేతులతో వేదన్నా వొండితే, అది నీసొంత మేననిపిస్తుంది. తిన్నంత సేపు, బాగా లేదు, బాగాలేదు. జీతం దండగ, తిండిదండగ అంటోవుంటారు. ఒక్క పిసరు మిగల్చకండాగిన్నెలు వూడ్చుకు తింటారు. వెనక దాచుకొన్నా నేమోనని ఆకుల కిందంతా వెతుకుతుంది ఆమహా తల్లి. ఇచ్చే

ప్పుడు అన్నీ కొలత. అవి పురుగుతో వుంటే ఆ వాసనలకి కడుపు తరుక్కు పోతుంది. నాకు మాత్రం రోజూ పచ్చడే గతి! బువ్వ తింటావుంటే ఆ గిన్నెలింకా మంచి తిరగమూతల వాసనే కొడుతో వుంటాయి. గోడలింకా ఊపొగత్తే ముక్కుకి కొడతాయి. వంటప్పై పుట్టడమంత పాప ఖర్మం యింకేం లేదు. మొన్న ఓనాడు వుడుకుతున్న రెండు చామ గడ్డలు పొయిలో పడిపోతే, లెక్కచూసి, నేను తిన్నానని కొట్టింది నన్ను—

చిట్టి: వీరీ! బాగా బలిశావే యిక్కడకు వచ్చి!

వీర : బలవకేం! ఏ మెతుకులు పడ్డా పాడువాళ్ళు! మనం యిట్టా బలుస్తాము. ఎంత తిన్నా వాళ్లు, అదేమిటో, మూలుగుతో మందులు తాగుతోనే వుంటారు. డబ్బంతా మిగిల్చి డాక్టర్లకు పోస్తారు. వాడున్నా మందులు, లేహేలూ, మింగుతోనే వుంటారు.

చిట్టి: నిద్రోస్తోందే, ఎక్కడ పడుకోను?

వీర : పడుకోవడమేమిటి? పోవూ?

చిట్టి: ఎక్కడికి పోనూ? నిన్న రాత్రి చావిడిలో దున్నపోతు పక్కన పడుకున్నాను. దోమలు వొళ్ళంతా నమిలేశాయి.

వీర : చూస్తారు.

చిట్టి: కోడి కూసేతలికి పోనా?

వీర : ఏమో నబ్బా! నాకొంపమీదికి తెచ్చేటట్లున్నావు.

చిట్టి : ఏం భయంలేదు.

దొడ్డికలుపువేసి పడుకొంటున్నాడు. వీరమ్మ వంటింటి గుమ్మం దగ్గర కూచుంది.

చిట్టి : ఒసే ! వాణ్నేం చేశావు? ... అదే... అప్పుడు భయపడ్డావే...

వీర : ఏం చేశాను! ఏదో వూళ్ళో కన్నాను, చచ్చింది. పీడ వదిలి పోయింది. సరేలే, పడుకో నేపోతున్నాను, చప్పుడు చెయ్యకు.

చిట్టి : ఎక్కడికిపోతావు ? ఏమిటి ! నేనిక్కడా, నువ్వక్కడానా.

వీర : మంచి వాడివే, వూరుకో.

చిట్టి : అదేమి ! నీవు కొత్త వాడితో మాట్లాడి నట్టు—

వీర : చాల్లే ఎప్పుడో ఓసారి— ఆగాడికొడుకు మాయ మాటలు చెప్పి, మోసం చేశాడు, ఇంక నీతో ! సిగ్గు లేదను కున్నావా యేమిటి ! నాకు అయినశాస్తి చాలు.

చిట్టి : ఆడదాన్ని తాకి ఆర్నెల్లయిందే... ...

వీర : పో, పో.

అతడు లేచాడు. ఆమె వెళ్ళి పోతోంది. పట్టుకున్నాడు.

వీర : వుండు, వుండు. నాకొంప ముంచు కావు అసలిక్కడ పడుకోకు. పో ముందు.

చిట్టి : పోతాలే, ముందు రా.

వీర : వొదులు. వొదులు—

పెనుగు లాడుతున్నారు, అంట్లమీద పడ్డారు.

వీర : కొంపముంచావు. అయింది నాపని కాస్తా. పో. పో. పరుగెత్తు.

చిట్టి: పరవా లేదులే.

వీర : అదుగో వస్తున్నాడు. పో.

చిట్టి: రానీ, వాడి గొంతు నరుకుతాను.

వీర : అయ్యో దేవుడా! ఏం చెయ్యను! నాయనా దణ్ణం పెడతా పోవయ్యా.

శోభనాద్రి వచ్చాడు ఇంటోంచి.

శోభ : ఏమిటది? ఏమిటది?

చిట్టి: నీ శ్రాద్ధం రా! దొంగముండా కొడకా!

శోభనాద్రి నెత్తిమీద ఒకటి పెట్టి పరిగెత్తాడు.

శోభ : చచ్చాను. చచ్చాను.

వీర : అయ్యో. అయ్యో!

శోభ: ఎవడే వాడు?

వీర : ఎక్కడ తగిలిందయ్యా?

శోభ: నేను చూచుకుంటాలే. ఎవడే ఎట్లా వచ్చాడు? ఏడీ! ఏడీ!

వీర : ఏమో.

శోభ: నీకు తెలీదా?

వీర : నాకేం తెలుసు? నేనూ యిప్పుడే వస్తున్నా.

శోభ: ఎట్లా వొచ్చాడు?

వీర : ఏమో.

శోభ: ఓసి దొంగముండా ! నీకు తెలీకుండానే వొచ్చాడూ? చెపుతావా, చంపనా ?

కొడుతున్నాడు.

—o—

## మూడవ రంగం

రాత్రి పదింటికి. వీరమ్మ వంటిల్లు కడుగుతోంది. సందులో కిటికీలోంచి చిట్టెయ్య తొంగిచూచాడు.

చిట్టె: వీరీ, వీరీ !

వీర : కొంపమునిగింది. ఎక్కడ ? ఎక్కణ్ణించి ? పో. (తిరిగి చూసి) పరిగెయ్యి, నీకోసం కావలి వేశారు. పో..

చిట్టె: ఎవరూ లేరులే.

వీర : ఎందుకొచ్చావు ?

చిట్టె: అదికాదే! నీమీద కేసున్నా వొచ్చిందేమో ! నిన్నేమన్నారో ! యెట్లావున్నావో అని—

వీర : వొస్తేవొచ్చిందిలే. నువ్వుపో. పోలీసుల్ని పంపించారయ్యా బాబు ! నామాటవిని లగెయ్యి.

చిట్టె: పోలీసులా ? యెందుకు ?

వీర : నువ్వు దొంగతనానికి వొచ్చావనుకున్నారు. నన్ను కొట్టారు. నే నేంచెప్పను ? నువ్వు మళ్ళీ వస్తావని కావలి వేశారు. పోవయ్యా నాయనా!

వెనకాలే మనుషులు చిట్టెయ్యని పట్టుకున్నారు.

మనుషులు: చిక్కాడు, చిక్కాడు.

వీర : అంతపనీ అయిందీ!

శోభనాద్రి, బసవమ్మ వొచ్చారు.

శోభ: లోపలికి తీసుకరండి. ఒకరు యిన్స్పెక్టర్ కోసం పొండి.

చిట్టెయ్యని దొడ్లోకి తెచ్చారు.

ఏంరా! ఎవరు నువ్వు? మాట్లాడవేం; బెల్లం కొట్టిన రాయిలా?

ఇరుగుపొరుగువాళ్లు వొచ్చారు.

కాదండీ, ఇదీ, వీడూ–కలిసి యిల్లు దోచుకోవాలని వేశారు. నిన్నరాత్రి, కొంచెంలో తప్పింది, అప్పటికే కన్నువాల్చని ముండావాణ్ణికనక—

పొరుగాయన: నిన్నరాత్రా!

శోభ: నిన్నరాత్రే! ఎక్కడ దొంగలు పడతారోఅని ప్రతి రాత్రి జాగ్రత్తగానే వుంటాం, పోతే వస్తువు మళ్ళీ మనకి దొరుకుతుందా!

పోలీసు యిన్స్పెక్టర్ వొచ్చాడు.

ఇన్స్పెక్టరు: వీడేనా! ఏవూరు?

చిట్టె : నంబివాడ.

ఇన్ : పేరు?

చిట్టె : చిట్టెయ్య.

పారు : ఎందుకొచ్చావు?

చిట్టి : జరక్క అడుక్కోటానికి.

పారు : బండలాగున్నావు, నీకు అడుక్కోడం ఏంరోగం?

చిట్టి : పని చేస్తానంటే ఎవరన్నా పనిచూపితేగా!

ఇన్ : మాటలు నేర్చావే! నీకు పనిదొరక లేదుగా! ఊ!

చిట్టి : నిన్నరాత్రి- కేకేస్తే- యీ అమ్మ దయతలచి కబళ మేసింది. ఇంతలో యీయన నన్ను పట్టుకోడానికి వొచ్చాడు; లగెత్తాను.

శోభ: అబ్బ! యేమెరుగవు. పూరికే పరిగెత్తావు! ఏం నంగనాచివిరా!

ఇన్ : వుండండి, పరిగెత్త వలసిన పనేమొచ్చింది?

చిట్టి : తనమీాది కొస్తుంది పొమ్మంది ఇది.

ఇన్ : కొట్టడ మెందుకు?

చిట్టి : నేను కొట్టానా? కొట్టలేదు.

శోభ: దీన్ని కావిలించుకొన్న దెందుకు?

పారు : దొంగతనానికి అదొకటి తోడు వుండవొద్దు!

బసవమ్మ : చూడండి, ఇది అట్లాంటిది కాదని కద మేము వంటకి పెట్టుకుంది! దీని కిదేం పొయ్యే కాలమో! కుక్కలు నయమండి, యీ పనివాళ్ళ కంటే! ఒక నీతి, జాతి వున్న మనుష్యులై తేగా?

ఇన్ : మరి దీన్ని యింకా పనిలో వుంచుతారెందుకు? తరి మెయ్యండి.

చిట్టె: కాదండి! అట్లాంటిదేమీ కాదు ఆమె. నిజం చెపుతున్నాను, ఆకలి వంక పెట్టి నేను చోరీకే వచ్చాను. ఇదితప్ప యింట్లో ఎవరూ లేరనుకున్నాను. అడ్డమొచ్చింది. నోట్లోగుడ్డకుక్కి బోయినాను. ఈయన వచ్చాడు.

ఇన్ : ఏమే! నువ్వు మాటాడవేం?

వీర : కాదు, మా యిద్దరికీ పరిచయమండీ, నా కోసం వచ్చాడు, అయ్యగారు పొరబడ్డారు.

చిట్టె: పొద్దుణ్ణించి నేనే మొరుగనన్నా వే!... ఏం? మాటాడవేం? పద, ఇంక బైటకి నడు.

వీర : నాజీతం ఇప్పించండి.

బస : నీజీతం దాచి పెట్టావు! యింటో దొంగని ప్రవేశ పెట్టి పైగా జీతం అడుగుతున్నావా! ఎన్ని గుండెలే నీకు? ఓహో నువ్వు చేసిన వంటకు జీతంకూడానూ!

ఇన్ : దీని మాటలు ప్రకారం కేసేలేదు. దీని మాటలు నమ్మటానికి వీల్లేదు. వాడే చెప్తూ వుంటున్నాడుగా దొంగతనానికి వచ్చానని, దీనిఅబద్ధపు మాటలతో మనకేం పని?

వీర : నిజమండీ! ప్రమాణంచేసి చెపుతాను.

బస : ఛీ— ముండా! నీబతుక్కి, నీ నీతికి తోడు నువ్వు ప్రమాణం చేస్తేమాత్రం నమ్ముతారా? రంకుతనం వెంట దొంగతనం వుండితీరుతుంది.

చిట్టి : తిండిలేక చస్తున్న వాణ్ణి. నాకు, ధర్మాత్ములు ఆస్తిపరులు, పనిచేస్తానంటే పనిచూపక రోజుల కొద్దీ మాడ్చి చంపారు. పైగా ఖైదుకి పంపుతున్నారు. అక్కడ నాలుగు నెలలు తిండన్నా దొరుకుతుంది. పోతాను. దీన్ని, దిక్కులేని దాన్ని, పాపం మెరుగనిదాన్ని, దీన్ని తరిమెయ్యకండి. ఇది యెప్పుడన్నా వీరాయింటో దొంగిలించిందా? పోక... వస్తువన్నా పోయిందా?

శోభ: వేరే దొంగిలించిందా? ఎవరిఅబ్బసొత్తని—నీకు తిండి పెట్టింది?

వీర : అయ్యో మీ భోజనం ఏమీ ఖర్చు కాలేదు. నేను తిండి మానుకుని, జాలేసి, యీయనకి పెట్టాను. మీరేం మిగిల్చారని యితనికి పెట్టను?

బస : తిండి మానుకునికూడా పెట్టావా? ఖ్రూరికే ఎందుకు పెడతావు? నీకెంత మనసు మళ్ళకపోతే పెడతావు?

ఇన్ : తీసుకు పదండిరా.

బస : (వీరమ్మతో) నువ్వూ నడు బైటికి.

వీర : పోనీ నేను తప్పుడు పనే చేశాననుకోండి ఏదో మానవ శరీరం. నీతీ జాతీ లేనిదాన్ని ఒక్కరాత్రికి కక్కుర్తిపడ్డాననుకోండి. పోనీ యీ అయ్యగారెవరు? తమరెవరు?

శోభ: పో బయటికి – నడుముందు.

వీర : (బైటికి పోతూ ఏడుస్తోంది.) ఎవరన్నా బంధువులువస్తే 'మానాయన' నాకొడుక్కీ యీయనకీ స్నేహం.

చిన్నబ్బాయి, మాయింటో చదువుకున్నాడు అని చెప్పి రాత్రి కాగానే అంగడిలో చేరతారే—

బస : చావతన్నాండి, చూస్తారేం!

వీర : తమకి సుభ్భై యేళ్ళు... నాకు యిరవై—
తన్ని తోసేస్తున్నారు.

---

# ఈర్ష్య

రాత్రి యెనిమిది గంటలు. వెంకుపంతులు యిల్లు.
హాలులో వెంకుపంతులూ, భార్య రాధమ్మ, కొడుకు సుబ్బులూ
వున్నారు. సుబ్బులికి నాలుగేళ్ళు. ఆడుకుంటున్నాడు.

రాధమ్మ: చూడండి. వీడుపాట చెప్తాడు. సుబ్బా, ఇట్లా రా.

సుబ్బులు: వుండు. ఈగుల్లం సలిగా పలిగెత్తడంలేదు. దీన్ని కొత్తీ, వొత్తాను.

రాధ : కాదురా, నాన్న పిలుస్తున్నారు. రా.

సు : వొత్తున్నా. గుల్ల మెక్కి వొత్తా. చల్, చల్,

కర్రమీద యెక్కివొచ్చి నుంచున్నాడు.

హాం, హాం, ఆగు, ఆగు. పోలీచుగుల్లం.

రాధ : చూడు. ఆపాట చెప్పు—నాన్న వింటారు.

సు : ఏ పాత !

వెంకుపంతులు: యెన్ని పాట లొచ్చేం నీకు ?

సు : చాలా వొచ్చు, ఏ పాత ?

రాధ : పొద్దున పాడలా, అదీ.

సు : వుండు. గుల్లం పోతోంది. హాం, హాం.

చుట్టూ తిరుగుతున్నాడు.

రాధ : అరే, ఇట్లా రారా అంటే,

సు : మలి కొంచెం— వులవలిత్తానా గుల్లానికి ? ఇత్తానంటే ఆగుతుంది.

రాధ : ఇస్తాలే, రా.

సు : హాఁ, హాఁ. పాతపాడీవోత్తా వుండు, గుల్లం. నాన్న పాలనా ?

వెంకు: ఊఁ, కానీ.

సు : చెలగు మాచే, ఏమిచేతులా, ఆ, ఆ, ఆ.
చెలగు మాచె, ఏమిచేతులా,
ములిపెముగల, మొదటి లతిలో—

రాధమ్మ నవ్వుతోంది.

వెంకు: ఛీ, నోరుమూయ్యి వెధవా!

సు : ఇందుకేనా పాలమన్నాలు? వులవలియ్యి.

వెంకు: వులవలు కాదు. తన్నులియ్యాలి నీకు, పాడుపాటలన్నీ నేర్చుకుంటూ. (భార్యతో) సువ్వేనా నేర్పించింది ?

సు : పాడు పాత లేంటి అమ్మా ?

శ్యామల వొచ్చింది. అనుమానంతో భయంతో వొచ్చింది. నిస్పృహ desperateగా కనపడుతోంది. రాధమ్మ నివ్వెరపడి చూస్తోంది.

శ్యా : మేమే, రాధా! జ్ఞాపకం వున్నానా ?

రాధ : (నిరుత్సాహంగా) యెక్కడ నించి రావడం ?

శ్యా : యేట్లోంచి...అబ్బా! యెంత సుఖంగా వున్నారో మీారు ? యెన్నేళ్ళయింది నిన్ను చూసి? మీాపిల్లాడా? మీా ఆయనా ? ఏం అదృష్టం ? అబ్బాయా? ఇట్లా రా, నాయనా, నీపేరేమిటి ?

రాధ : సుబ్బులు.

శ్యా : యేమిటే కూర్చోమన్నా కూచోమనవు? నేను రావడ మిష్టం లేనట్టుంది. అనుమానంతోనే వొచ్చాను. ఐతే పోతాను.

సు : వెళ్లొద్దు. అమ్మ పాత పొలుతుంది.

శ్యా : వెడుతున్నానే.

తిరిగింది.

రాధ: యెందుకు? నేనే మన్నాను?

శ్యా : నోటితో వేరే చెప్పించుకోవాలా?

రాధ : అదికాదే, ఏమిటో ఆకాశంలోంచి వూడిపడ్డట్టు పడితివి. ఆశ్చర్యపోయినాను. ఏమీ అనుకోకు. రా. కూచో.

లేచి ఆమెని తీసుకొచ్చి కూచోబెట్టింది.

సు : వుండండి. ఇక్కతే బువ్వతిసండి. లేపొద్దునే నా గుల్లం యిత్తాను. ఎక్కి పొంది. ఈవాల వులవలు పెత్తి యిత్తాను. పెత్తకపోతే యేలుత్తుంది, పా ఆపం.

శ్యా : నాబతుక్కి గుఱ్ఱంకూడా యెక్కనా బాబూ!

వెంక: రాధా! ఈమె యెవరో నాకు చెప్పావే కావు!

సు : పిన్ని, నాన్నా.

రాధ : నేను నాచిన్నప్పటి స్నేహితురాలని చెప్పలా? అదీ. చిన్నప్పుడే ముండమోసింది. చదువుకుని టీచరుపని చేస్తో, వాడెవరో, ఆ పాటకుడితో ఆపని మానేసుకుని—

వెంక: తెలిసింది.

శ్యా : (కన్నీళ్ళతో) చివరికి నాగతి యిట్లాఅయింది. నిలవ నీడ లేక అల్లాడి పోవలసి వొచ్చింది.

వెంకు: ఏమయింది?

రాధ: ఏముందీ? మామూలు కథే! నాలుగు రోజుల మోజుతీరగానే తరిమేసి వుంటాడు,

శ్యా : లేదు. ఆయన చచ్చిపోయినారు. నాకిప్పుడు ఆరు నెలల గర్భిణి-

రాధ: అట్లాలే, పాపం!

శ్యా : నాకోసం కాదు- తిండికోసం. నాలోపల గిలగిలలాడే ఆయన పిల్లకోసం —శ్రీమంతుడి బిడ్డ—దౌర్భాగ్యు రాల్ని నామూలాన, గుప్పెడన్నం కోసం, కొట్టుకో వలసి వొచ్చింది. ఆపిల్లకోసం నేను ప్రాధేయ పడు తున్నాను మీా ముందు. (వేడుకొంటూ) చద్దా మను కున్నాను. కాని ఆయన రూపం, ఆయన రసికత్వం, కంఠమార్దవం— అంతకీ, యీా పిండం వొక్కటే మిగిలిన చిహ్నం. దీన్ని నాశం చెయ్యడానికి చేతులు రాలేదు. గతేమిటి దేవుడా అనుకుంటూ వుంటే, నువ్వు జ్ఞాపకం వొచ్చావు. తప్పకండా ఆదరిస్తావని ఆశపడి వొచ్చాను.

రాధ: (శ్యామలని కావిలించుకుని) నేను వెనక్కి తగ్గుతా నటే! మంచి పనిచేశావు నాదగ్గిరికి రావడం—

సు : ( శ్యామలని కావిలించుకుని ) నీకు నా పత్తు చొక్కా కూడా యిత్తా... నా కుక్కపిల్ల కుయ్యి అని తోక ఆలిత్తుంది.

రాధ: ఇది నీయిల్లనుకో. సుఖంగావుండు. నీయిష్టం. ఎంత కాలమైనా వుండు.

శ్యా : నేను ప్రసవ మయిందాకానే శరణమివ్వండి. చాలు.

సు : చాలునా? యిత్తాను. నీకు జీడి పప్పులు కూలా పెత్తాను.

శ్యా : ఐతే నా ట్రంకు బైటవుంది. తెచ్చుకుంటాను.

సు : నేను తెత్తాను.

శ్యా : తీసుకొద్దాం, రా.

శ్యామలా, సుబ్బులూ బైటికి వెళ్ళారు.

రాధ: దాన్ని వుండ మనడం మీా కయిష్టం కాదుకదా?

వెంకు: పాపం, ఆపదలోవుంది.

రాధ: మీాకిష్టమేనా అది చెప్పండి?

వెంకు: నాకేం-తెలుసు? నీస్నేహితురాలు.

రాధ : ఎప్పుడూయింతే మీారు. సంతోషంగా సరేనన లేరూ!

వెంకు: ఎవరో కొత్తమనిషి, ఇంటో పెట్టుకుంటా నంటావు. ఆమె చెప్పేదంతా నిజమేనా?

రాధ : అన్నీ అనుమానాలే? అదెప్పుడూ అబద్ధం చెప్పదు.

వెంకు: లేచిపోయిన మనిషి——

రాధ : చాల్లెండి పాపం; దాంతో సరిగా మాట్టాడండి. ఏమనుకుంటుందీ? లేచి పోయిన మని షంటారు, మీారుకూడా. ఏంచేస్తుందండీ, పసితనంలో మొగుడు పోయిన మనిషి! దానిదీ మానవ జన్మమే కదా!

శ్యామలా, సుబ్బులూ, ట్రంకూ, పక్కచుట్టా తీసుకొచ్చారు.

సు : ఇక్కడల పెత్తు ... పెత్తెలో ఏమున్నాయి? బొమ్మలా? ఒక తిత్తావా?

శ్యా : లేవు నాయనా! నువ్వున్నావని తెలీదు. తెలిస్తే కొనుక్కొచ్చే దాన్ని.

వొచ్చి కూచుంది.

ఎంత అదృష్టవంతురాలవే రాధా! ఎంత చక్కని కొడుకు.

రాధ : నా అదృష్టానికేం గాని, నువ్వూ ఎవో సంసారమూ అదీ సుఖంగావుంటే నాకెంతసంతోషంగా వుండేది!

శ్యా : చిన్నప్పుడు, ఇద్దరమూ పెళ్ళి చేసుకోకండా, దేశాలు తిరుగుదా మనుకున్నాము.

రాధ : కాషాయ గుడ్డలు కట్టుకుని, పాడుకుంటో—

శ్యా : (దిగులుగా నవ్వుతో) ఎంత సంతోషంగా వుండేవి ఆరోజులు. ఇట్లా అవుతా ననుకున్నానా —

రాధ : పాపం, ఎంత గతి పట్టిందే నీకు! యెట్లా గట్టెక్కను యీచిక్కులు?

వెంక: యేమిటీ! ఈ కాన్పు కాగానే—ఆమె పొట్టా, ఆ పాప పొట్టా పోసుకో లేదా.! ఎందుకు, నా స్నేహితుల యిళ్ళలో ట్యూషను లిప్పిస్తాను—

రాధ : సంగీతం ఎంత బాగా వొచ్చునని!

వెంక: యింకేం!

రాధ : నిక్షేపమంటి ఉద్యోగం ఎందుకు వొదులుకున్నావే?

శ్యా : మరి ఆయన ఆఫ్సీసుల్లో నాతో కూచుంటారా? దేశాలు తిరిగి కచేరీలు చేయవలసిన వారమ్యేను?

రాధ : దేశాలు తిరిగి కచేరీలు చేసుకోమను, నువ్వెందుకు?

శ్యా : నన్ను ప్రేమించా రాయన! మరి సీత సమస్తమూ వొదులుకుని రాముడి వెంట పోలేదా? దమయంతి వెళ్ళలేదా?

రాధ : సీతా దమయంతితో పోల్చుకోవలసిందే — నమ్మి, పోయినందుకు బాగా చేశాడుగా నిన్ను!

శ్యా : రాధా! ఆయనన్నేమీ అనకు. నేను భరించలేను. ఆయన మహాత్ములు. ఒక్క రాగ మెత్తారంటే— పాట కచేరీలో కాదు—ఒక్కొక్క రాత్రి ఏ మైదానంలోనో, వెన్నెల్లో కూచున్నప్పుడు, చంద్రుడు సముద్రపు కెరటాల్లో మునిగి పోయే టప్పుడు, నా కోసం, ఆయన పాడారంటే — ఏంచెయ్యాను, నా ప్రాణాన్నంతా యెట్లా ఆరాగంలో కలిపెయ్యాను, ఆయన కేవిధంగా నేను ఆనందమివ్వనని ఎంత పెనుగులాడేది నాఆత్మ. నీకర్థమౌతోందా? ఆయన మహాత్ములు— నావంటి వాళ్ళు పదివేల మంది ఆయన కోసం ప్రాణాల్ని ధారపోసినా, ఒక్క యెక్కువ కాదు. పంజాబులో, ఢిల్లీలో ఎటువంటి అంతఃపుర స్త్రీలు, ఆయనకి రహస్యంగా కబుర్లు పంపేవారో నీకు తెలిస్తేనా? హారాలు కవర్లలో పెట్టి కానుకలు పంపారు. అటువంటి రసికుడు, అవతారమూర్తి నా వంక కన్నెత్తి చూశారనేదే నా పూర్వజన్మసుకృత విశేషం. ఆ తేజో మూర్తి, కళానిధి ఆత్మను నా గర్భాన ధరిస్తున్నాననే తలపే ప్రాణాన్ని నిలుపు

తోంది. ఆయనే ఆకస్మికంగా చనిపోక పోతే, నేను మహారాణీలను చూసి, ఐనా యీర్ష్య పడుదునా? చివరికి నాదర్శనం కోసం ఎందరు కాచుకుని పడి వుండే వాళ్ళు?

వెంకు: మరి ఆయన చాలా సంపాయించి వుండాలి కదా? మరి మీాకు యేమీా మిగలకండా చేశాడేమి?

శ్యా: ఆయనకి జాతకాల్లో నమ్మకం. ఆ నమ్మకమే ఆయన్ని చెరిచింది. ఆయనకేం? నన్ను చెరిచింది. తనకి డెభ్భై యేళ్లు ఆయుర్దాయమనేవారు. ఎప్పుడు నేను దిగులుపడ్డా, 'నీకెందుకు శ్యామలా, నేనున్నానుగా, యింక ముప్పై అయిదేళ్ళు. నీకు వచింతా లేదు.' అనేవారు. నమ్మాను. తెలివితక్కువ దాన్ని. నాకోసం కాదు. ఈ శిశువు కోసమన్నా నేను జాగ్రత పడవలిసింది; పిల్లలుంటారనే ఆలోచనన్నా వొచ్చిందా నాకు, వెర్రిదాన్ని.

వెంకు: ఆయనేం నిలవ చెయ్యి లేదా?

శ్యా: చెయ్యకేం? ఎంత ధనమో, ఆ బాంకి బుక్కులో! అంతా నాదే అనుకున్నా, ఈ 'లా' నాకేం తెలుసు? ఒక్క రవ్వ—ఆయన పక్క బొత్తాములు జాచుకునివుంచేట, ఆయన రవ్వపు ఉంగరం ఒక్కటి నా వేలిన పెట్టుకుని వుంటే— నాకీ కష్టాలు వుండేవి కావు. నాకేం తెలుసు? వొచ్చి పడ్డారు ఆయన తమ్ముళ్లంట. అన్నేళ్ళూ ఆయనను వెలివేసినవాళ్ళు, అన్నచచ్చాడని చెప్పుకున్న వాళ్ళు, ఆస్తికిమాత్రం

వొచ్చి పడ్డారు. అన్నీ, ఆయన దగ్గర నేను దాచు కున్న ఐదు వందలతో సహా, తీసుకున్నారు. ఇదేం 'లా' ఓ నాకు తెలీదు. ఆయన బిడ్డని అనాధని చేసి— తమ్ముల కిప్పించింది. ఏమి న్యాయమో!

వెంక: కోర్టుకి వెడితే కొంత యిప్పిస్తారను కుంటాను.

శ్యా : అదొకటే మిగిలింది యీబతుక్కి.

రాధ : పిచ్చిదానివి, ముందే జాగ్రత్తపడి డబ్బంతా నీ నీపేరుతో వేసుకోవలిసింది. అప్పుడూ యింతే— వెనిమిటి ఆస్తినంతా పుట్టింటో వొదిలి పెట్టి వొచ్చావు.

శ్యా : కాని ఆ ఆనందంలో ముందూ వెనకా చింతలే లేవు నాకు.

రాధ : ఆనందం? ఆనంద మేమిటి? పాడు ఆనందం! నీ మొహాం! ఆనందం లాగేవుంది, ఏమిటే ఆ ఆనందం!

శ్యా : ప్రేమించిన ఆనందం.

రాధ : అంటే?

శ్యా : ఎట్లా చెప్పను? నీభర్తనీ, బిడ్డనీ, ప్రేమిస్తే ఆనందం రావటంలేదూ నీకు?

రాధ : చాస్తే? నువ్వు తెలీకుండా పోతుందా నాకు? ఆయన యిన్నాళ్లెన్ను ఎవరికోసం కడుతున్నారో అడుగు, నాతో సరిపోల్చు కుంటున్నావు? అందులో— అట్లాంటి సంబంధంలో— ఆనంద మేమిటే, నీ మొహాం?

శ్యామల ధ్యాస ఘాతకాలంవేపు తిరిగింది.
తలుచుకుని మాటాడ్తూ మైమరుస్తోంది.

శ్యా : నీకు తెలీను. నువ్వు పొందే ప్రేమ, ఎట్లాగో యేం మంత్రం వల్లనో వెయ్యిరెట్లు అధిక మవుతుందనుకో. కాదులే, ఆ ఆనందమే వేరు— ఇట్లా కాదు, అసలు నీకు యిప్పుడు, పదిలక్షల రూపాయలు లాటరీలో వొచ్చాయి అనుకో—చీరె చిరిగినసంగతిగాని, రేపు యేం కూర వొండుదామని గాని, యోచించగలరా! పెద్ద సూర్యుడు నీ ముందు అనేక రంగులతో వెలుగుతో వుంటే, ఇంకేమన్నా నీ కళ్ళకు కనబడుతుందా? అట్లాగనూ— ఎంత ప్రేమించాను! ప్రతి నిమిషమూ; ప్రతి రక్త బిందువునీ ఆయనతో లీనం చేశాను. ఎన్ని దేశాలు తిరిగాము! ఆగ్రా, కాశ్మీరము, కలకత్తా, డార్జిలింగ్, మధుర, మైసూరు— వెన్నెలలో సముద్రపు వొడ్డున యిసికలో, హిమాలయాల్లో సూర్యు డుదయించేప్పుడు, నానిటాల్ సరస్సులో, కాశ్మీరపు నదుల్లో, టాజ్‌మహల్ ముందు అతను నాపక్కని ఆనుకుని, నానడుంమీద చెయ్యి వేసి, నాకళ్ళలో అతని నవ్వు, నా అందాన్ని అతని ఆరాధన— పెద్ద సభలు— పువ్వులు, ఆహ్వానాలు, ధనము, కీర్తి, యెట్లా చెప్పను! నన్ను నీచంగా చూచారా ప్రజలు— నేనొక్క పలుకు పలికితే మహా భాగ్యంగా పలకరించేవారు. అట్లాంటి లోకం వుంటుందసి, అంత అందం, సౌఖ్యం, అత్తరులు,

చీరెలు— వుంటాయని కూడా తెలీదు నాకు— కల లోకూడా, యెట్లా తెలుసను నాఆనందం! ఈ పిచ్చి దరిద్ర జీవితాల్ని, యీక్షుద్రసాధారణ సంసారాలనీ పిచ్చికల్లాగు గూళ్ళల్లో చిన్న దీపాలు పెట్టుకుని, పచ్చళ్ళు నాకు—నే దంపతుల్ని చూస్తే? నాకెంతదిగు లేస్తుందీ?

పెద్దనిటూర్పు విడిచి కళ్ళుతెరిచింది.

అందుకనే నాకు బతుకు మీద ఆశలేదు— సుఖంగా సంసారాలను చేసే వాళ్ళని చూస్తే యీర్ష్య లేదు. నాశరీరానికి ఉపయోగం గడచి పోయింది— ఈ శిశువుని కనడం కోసమే నిలిచి వుంది.

నాచేతుల్ని, నాకాలి వొంపుని నా మొహం మీద పడే జుట్టుని, నన్ను నిలువునా, నా అందాన్ని …… …

మొగవాడున్నాడని జ్ఞాపకం తెచ్చుకుని చప్పున ఆపింది.

పూజించి అరాధించే కవి పోయింతరువాత—నాకెం దుకీ జీవితం?

వెంకు: ఎందుకట్లా అంటారు? మళ్ళీ పెళ్ళిచేసు—

శ్యా : నాకా! ఆయనతో నేనూ కాలి పోయినాను. నాకింక మొగాళ్ళూ లేరు, లోకమూ లేదు.

సు : అమ్మా, నిద్ర వొస్తోంది.

రాధ: పడుకో, వెళ్ళు.

సు : నాకు భయం.

శ్యా : బాబూ, రా, పడుకో పెడతాను. నేనుకూడా పడుకుంటానే.

రాధ : అక్కడే, బాబుపక్కనే పడుకో. తివాసీ వుంది. పక్క పరుచుకో.

సు : ఇప్పుడు అమ్మకీ, నాన్నకీ చెప్పాలా— అత్తాంతి మంచి కథ చెప్పు. నేను, పెద్దవి—మరులా—ఇంకా - ఇంకా— అన్నీ పోతా.

శ్యామలా, సుబ్బులు వెళ్ళారు. కొంచెంసేపు మాటల్లేవు.

రాధ : (మెల్లిగా) దీన్ని పంపించేద్దాం. ఇదిమనింటో వొద్దు.

వెంక: ఇదేమిటి ? ఇందాకన్నించి వుండమని బతిమాలి, వాగ్దత్తం చేసి నమ్మించి,—యెట్లా పొమ్మంటావు ? యెందుకు ?

శ్యా : అవును లెండి. కాని... మరీ... యింత దుర్మార్గురాలని తెలీలేదు.

వెంక: ఇప్పుడేం కొత్తగా దుర్మార్గురాలని తెలిసింది ?

రాధ : ఏదో పాపం చేస్తే, భయపడి, నీచంగా, బాధగా బతికితే కనికరించ వచ్చు. కానిదుర్మార్గంలో యింత సుఖం— సరిగా కష్టపడి సంసారాలు చేసి, బాధలు పడే మాకన్న సుఖ మనుభవిస్తే— ఎంత దుర్మార్గురాలై వుండాలి ! ఎంతో రాక్షసులైతే తప్ప, అంత పాపంలో, అంత ఆనందం పొందలేరు.

వెంక: మరి ఆనందం లేకపోతే పాపంలోకి ఎందుకు దిగుతారనుకున్నావు ?

రాధ : ఇట్లాంటి ఆనందమా ? ఏదో ఆగలేక యీ పాడు శరీరంకోసం, పాపం చేసినా అంతరాత్మ అంతసేపూ బాధిస్తూ వుంటుందనీ,— ప్రతి నిమిషమూ పశ్చాత్తాపంతో యేడుస్తూ వుంటారని అనుకున్నాను. కాని దానికి సిగ్గులేదు. చూడండి. పశ్చాత్తాపమే లేదు. పాప భీతిలేదు. దైవ భక్తి లేదు నరకంలో కాలుస్తూ వుంటే అప్పుడు తెలుస్తుంది ఈ ఆనంద మేమిటో— ఇన్నాళ్ళూ, డబ్బుదాచిదాచి సంసారం చేసినా, ఒక్క మెడాసు తప్ప చూడలేక పోతిమి. అది ఒక్క దెబ్బని లోకమంతా చుట్టింది. అందులో మర్యాద, కీర్తి — ఇది వాడి భార్యే అనుకున్నారు గావును. ఎవరనాన్న. అసలుసంగతి చెప్ప వలిసింది. అయ్యోది అమ్మగారి పని-

వెంకు: ఒకవేళ నరకం లేదనుకో, వున్నా నరకానికి పోదనుకో.

రాధ : ఎందుకు పోదు ? తప్పకండా పోతుంది.

వెంకు: మరి కాశీ, గయా, తిరిగింది గదా—

రాధ : ఐతే మాత్రం ? అటు తరవాతా చేసి వుంటుంది. కాని అది యిక్కడ వుండడానికి వీల్లేదు.

వెంకు: (ఆలోచనతో) ఇదేగావును కారణం, పాపం చేసిన స్త్రీలను చూస్తే యీ సంసార స్త్రీలకు అంత కోపం కలగడానికి.

రాధ : ఏది ?

వెంకు: ఈర్ష్య.



# ఆడవాళ్ళ ఆకలి

పొద్దున్న పదిగంటలవేళ—శీతయ్య గారి
యిల్లు. చిన్నమ్మ బటానీలు కొంటోంది.

చిన్నమ్మ: సోలెడు బియ్యాని కిస్తేనా! పోసీలే, తీసుకుపో.

తన కొంగులోంచి బటానీలు తట్టలో పోసింది.

బటానీలమనిషి: ఏంటమ్మా! చూసు బటానీలపాతర వుందను కుంటున్నావా? ఇట్లాతే, మంచి బేరమే! ఎవరి మొహం చూశాకూ పొద్దున్నే! పోయ్యి.

చిన్న: పోస్తినే!

బటా: ఆ! అవేమిటి?

చిన్న: బాగానే వుంది. ఇందాక నేను కొనుక్కున్నాను; అవీ, ఇవి. ఆ నల్లటి మనిషి లేడూ— నత్తిగా మాట్లాడతాడూ—వాడి దగ్గర.

బటా: చాల్లే వూరుకో! నేర్చావు మాటలు!

చిన్న: మంచి వాడివే! ఈకాసిని బటానీల కోసం నే నబద్ధ మాడతానా!

బటా: ఏమిటి? పైగా ఓంగ్రడిస్తున్నావా! ఎవడికి పుట్టా వమ్మా నువ్వు! ఇంక మాటాడకు. అవిట్లాపొయ్యి.

చిన్న: (కన్నీళ్ళతో). అన్యాయంగా తిడుతున్నా వెందు కబ్బీ నన్ను! నీకు ఆడవాళ్ళు లేరూ—

బటా: ఏడవకు; ఈకాస్త భాగ్యానికి! వుంచుకో— నువ్వెంత

కరువు వాచావో! ఇంతలో నా బంగార మంతా పోదూ—పోనీ, అడగరాదూ !

చిన్న: అడిగితే యిస్తావా ? మంచి వాడివి.

బటా: సగేలే—ఇంతకీ కొంటావా కొనవా!

చిన్న: కొనకేం ? యియ్యి.

బటానీలు పోశాడు.

మళ్ళీ అంతే యిచ్చావు. సరి ఒకటిన్నర యిస్తానన్నావుగా!

బటా: బకేదానివి! ఇది కుదిరే బేరంకాదు—

తట్టెత్తుకుంటున్నాడు.

చిన్న: నాబియ్యం ఇయ్యి.

బటా: ఆ! ఇంకా బియ్యమే! బియ్యం యివ్వకేం ? బటానీలన్నీ తిని, బియ్యంట !

చిన్న: ఇయ్యవూ ? ఆబియ్యం కొలత తక్కువైతే, చంపుతారాయన... అన్నా, యియ్యవూ ! నా బాబు కదూ! నీకింతలో తక్కువా ! నీకడుపున పుడతా—

బటా: అయ్యో దౌర్భాగ్యమా ! తీసుకోవమ్మా, మళ్ళా నీ గడప తొక్కితే వొట్టు— అరే, వుండూ— అట్లా తింటావేం ? ఆగు—

బియ్యం కొలుస్తున్నాడు.

చిన్న: అదుగో, అదుగో, ఆపల్లని వాడే నాకు బటానీలమ్మింది.— కావలిస్తే అడుగు. అబద్ధమన్నావు—

బటాసీలవాడు రోడ్డువేపు చూస్తున్నాడు.— చిన్నమ్మ అతనితట్టలోంచి వేరుశనక్కాయలుతీసి వెనకపోసుకుంది.

కానీకి ఎన్ని యిచ్చాడను కున్నావు? దోసెళ్ళతో నాయుందు పోసి పోయినాడు. పైగా యింత శనగ పప్పు కూడా బలవంతాన పెట్టాడు—

బటా: వాడికి శనగ చేనుంది— వాళ్ళ అత్తవారు— ఏకీ ఎవరూ లేరే!

చిన్న: సందు తిరిగాడు గావును! ఎంత తొందరగా నడుస్తాడు! నీ పేరు చెపితే 'ఆసాట్లవాడా, వాడు మహా పిసినారి మునుండాకొడుకు' అన్నాడు.

బటా: ఈసారి కనపడనీ చెప్తాను— అట్లాతినకు— అరే— ఫుండు - చంటి పిల్లలు నయం— పొద్దెక్కింది— పోతాను— ఈ వేరుశనక్కాయ కింద కెట్లా వొచ్చిందో! తియ్యలేదుకద నువ్వు!

చిన్న: ఛా, నాకు వేరుశనగ పేరు చెబితే వాంతిపుడుతుంది— నాకెందుకు!

బటా: ఇదిగో, ఎన్ని తరిగాయో! తీశావా! చూసుకో.

చిన్న: ఏమిటీ పాప అనుమానం, అబ్బ! బ్రాహ్మలం మేమట్లా చేస్తామా! బీదవాడివి నీసొమ్ము కావాలా!

బటా: ఈ మాటలకేం—చూపించు.

చిన్నమ్మ తిరిగి వొడి దులిపింది.

ఓసారిలే—ఏమౌతాయి!

చిన్న: మంచి వాడివే! ఏమిటా మాటలు! కూచున్న దాన్ని నీకోసం లేస్తానా? పో.

బటా: ఎవరమ్మా నువ్వు? లేస్తావా లాగనా?

చిన్న: లాగుతావా? ఆయన రానీ చెపుతాను! ఆడదాన్ని లాగుతావా?

బటా: ఆడదానివా నువ్వు!

చిన్న: నీకు పిల్లలు లేరూ? ఈ కాసిని కాయలుపోతే నీకేం తరుగా? ఈసారి వచ్చినప్పుడు బియ్యం యిస్తాలే.

బటా: యియ్యకేం? లే.

చిన్న: నేను లేవను— ఏం చేస్తావు? పోనీ యిదిచూడు, నీ కూతురు నాలుగు కాయలు తిన్నదనుకో.

చిన్నమ్మను లాగుతున్నాడు.

ఇస్తా, ఇస్తావుండు— ఆడదాన్ని లాగుతావా? నా అయ్య కదూ! నీ కూతురనుకో. వొదులు— వెధవా, పరాయి ఆడదాన్ని వొంటరిగా చూసి—

శీతయ్య, విశ్వనాథం వొచ్చారు. విశ్వనాథం బటానీల వాణ్ణి ఒక్క గుద్దు గుద్దాడు.

బటా: చచ్చాను.

విశ్వనాథం: ఏమిటిది? ఏమిటిది?

చిన్న: వీడు నన్ను లాగుతున్నాడు—

శీతయ్య: యెందుకు?

చిన్న: నా గాజుల కోసమో, యేమో!

బటా: నారాయణా, నారాయణ— బాబూ చూడండి—

విశ్వ : వంరా, దొంగ వెధవా! హో శీతయ్యా, వెళ్ళి పోలీసుల్ని పిలు—

శీత : వుండరా. తొందర పడకు. యేమీ గాజుల కోసమా? అసలు వీడెందుకు వొచ్చాడు?

చిన్న: యేమో దొంగ వెధవ!

శీత : అసలెందుకు తలుపు తెరిచావు నువ్వు! నేను తెరవొద్దన్నానా? బటానీలు కొన్నావా మళ్ళీ!

చిన్న: లేదు. తలుపు కొడితే మీరను—కాదు కిష్టయ్యగారను కున్నాను.

బటా : రామ, రామ—

విశ్వ : నోరు ముయ్యి— వెధవా!

శీత : కిష్టయ్య—

చిన్న: కాదు, కాదు. నా మతి వుండా, కిష్టయ్య అంటా నేమిటి? విశ్వనాథంగారు—

విశ్వ : అవును. నేను వొస్తానన్నాను.

శీత : యెందుకు?

బటా : నేను తలుపు కొట్టానా? నేను రాసంటో వుంటే పిలిచి పైగా!

విశ్వ : నోరుముయ్యి. యెందుకు గాజులు లాగావురా?

బటా : నేనా? గాజులా! పట్టపగలు! రామ రామ.

విశ్వ : రాత్రి దొంగవా?

బటా : నేనా?— దొంగనా?

విశ్వ : ఐతే యెందు కట్లా అరిచింది ? నువ్వు చెయ్యిపట్టుకు లాగడం నేను చూడలేదా ? దొంగవెధవా.

రెండు కొట్టాడు.

బటా : బాబూ, వినండి; బాబూ,

విశ్వ : ఇంకా వినాలా ! ఇదే వినడం.

మళ్ళీ కొట్టాడు.

పో, ముందు పో... కాదు వుండు... శీతయ్యా, చూస్తావేం, పిలు, పోలీసుల్ని.—

బటా : వినండి, నా కాయలు వెనకపోసుకుంది, ఆ అమ్మ - అందుకు లాగాను.

విశ్వ : లాగావా ? లాగింది నిజమేకద ! అడదాన్ని లాగుతావా ? పైగా కాయలంటున్నావా ? (కొడుతున్నాడు.)

బటా : బాబో, బాబో, లేవమనండి- చూడండి.

శీత : లేవ్వే, లే.

చిన్న : వాడే పారపోసుకున్నాడు కాయలు.

శీత : లే.

శీతయ్య లాగాడు.

చిన్న: చూశారా, చూశారా, ఎన్ని కాయలో !

శీత : నువ్వు పో, వెళ్ళిపో.

బటాణీలవాడు కాయలేరుకుంటున్నాడు.

బటా : ఎంతచేశేవమ్మా ! ఎన్ని దెబ్బలు తిన్నాను నీ మూలన ! ఎవరిమొహం చూశానో !

విశ్వ : ఒరేయ్, ఆ కాయలు వొదిలెయ్యి. ఫో, ముందు—పో.

వాడి తట్టని పైటపారేసి, వాడి చేతులలో
రహస్యంగా రూపాయి పెట్టాడు.

ఎవరికోసన్నా అన్నావా—

బటా : నా కెందుకు బాబూ—

విశ్వ : పో, దొంగవెధవా! అబద్ధాలూ నువ్వూనూ—

విశ్వనాథం వాణ్ని గెంటి తలుపేశాడు.
సీతయ్య మంచంమీద కూలబడ్డాడు.

సీత : చూశావా, విశ్వనాథం! చూశావా! నాబతు కెట్లా కాలిపోతోందో — దొంగతనం — అబద్ధాలు— ఒక్కటే తక్కువ! అదికూడా నాకు తెలీకుండా జరుగుతూం దేమో! ఇన్ని వుంటే అది లేకుండా వుంటుందా?... ఒసే, నీకా బియ్యమెక్కడివే!

చిన్న: ఎక్కడివి ?

సీత : ఎట్లానే నీతో? మళ్ళీ తాళాలు దొంగిలించావా?

చిన్న: లేదండీ, లేదండీ!

సీత : నిజం చెప్పుతావా?

చిన్న: నిజం, నిజం.

సీత : చూస్తానుగా!

సీతయ్య లోపలికి వెళ్ళాడు.

చిన్న: కొడతాడండీ—భయమేస్తోంది. కొడతాడండీ.

విశ్వ : (ఆశ్చర్యంతో) కొడతాడా?

శీత : (లోపలినుంచి) ఇదుగో, పెట్టె తీసే వుంది. మూడు తాళాలు సంపాయించి వుంటుంది, యీ ముండ.

చిన్న: (ఏడుస్తూ) అబ్బో కొడతాడు- దాంతో-గట్టిగా కొడతాడు. నేను చచ్చిపోతా—

శీతయ్య వొచ్చాడు.

శీత : ఎన్నని కొట్టను?

చిలకకొయ్యనించి తాడు తీశాడు. చిన్నమ్మ వాణుకుతో యిటూ అటూ చూస్తోంది.

విశ్వ : శీతయ్యా—

శీత : వొండడానికి బియ్యం కొలిచి యిచ్చాను. కొన్ని దాచేసింది. గిన్నెనిండా అన్నం వుండకపోతే తన్నాను. ఒకరోజేంచేసింది, అన్నం అడుగున దూది పెట్టి, పైన అన్నం అదిమిందిరా, 'ఏమిటే, అన్నం కెలికినట్టుం' దంటే 'పిల్లి కెలికిందడీ—' ఎంత కొట్టినా, నరికినా బుద్ధిరాదు. వేరుశనగకాయలూ దాచడం - (కొట్టాడు) వేరుశనగలు-మిఠాయి కాదు, పళ్లు కాదు- (దెబ్బ) బటానీలు (దెబ్బ) జావున్నాయా పప్పులు.

చూడలేక విశ్వనాధం తల తిప్పుకున్నాడు.

శీతయ్యగారి భార్య వేరు శనగలు దొంగిలించిందంటారు.

దెబ్బలుకొడుతున్నాడు. చిన్నమ్మ చప్పుడు చెయ్యక కుండా బాధ పడుతోంది.

ఎట్లావుంది ? బియ్యం దాస్తావా ? (దెబ్బ) తిరిగి తాళాలు తీస్తావా ? (దెబ్బ)

చిన్న : అబ్బా !

శీత : ఆడుగో, అదే వొద్దంది. బైటకి శబ్దం వచ్చిందా ? నాతలు పెట్టాన ! దొంగతనం కాక పెళ్ళాన్ని కొడుతున్నాడని దెప్పుకోవాలా ! నీదుంప తెగా ! అబ్బా, అంటావుగా ?

కొడుతున్నాడు. విశ్వనాథం చప్పున లేచాడు.

విశ్వ : ఆగు.

శీత : నీకు తెలీదు వూరుకో. (కొట్టాడుమళ్ళీ, విశ్వనాథం తాడు లాక్కుని పారేశాడు.) ఒరే, ఈ విషయంలో అడ్డంరాకు.

విశ్వ : ముందు అట్లా కూచో. (శీతయ్య మళ్ళీ తాడు తెచ్చు కోబోతున్నాడు.) చాలు.

శీత : అయ్యో యీమాత్రం ఏం లెఖ్ఖ !

విశ్వ : ఇంక నిన్ను బలవంతంగా ఆపుతాను. విను, నామాట.

శీత : నామాట తరవాత—

మళ్ళీ చాలా గట్టిగా కొట్టాడు.

చిన్న : (బైటికి వినబడ కుండా) చెయ్యను— దాచను— ఇంక కొడితే చచ్చిపోతాను.

శీత : చస్తాను, చస్తానంటావు. చావవు గద ? పాపిష్టి ముండా ! నువ్వన్నా చావాలి, నేనన్నా చావాలి.

విశ్వనాథం కలియపడి శీతయ్యని పడేసి పట్టుకున్నాడు.

విశ్వ : అమ్మా నువ్వింటోకి పో.

చిన్నమ్మ వెళ్ళింది.

శీత : నీకు తెలీదురా విశ్వనాథం, దీని సంగతి !
(లోపలికి) తొరగా కానీ పిండాకూడు—
ఇప్పుడింక కడగడాలు, తోమడాలు గీని శ్రాద్ధం మొదలు పెడుతుంది. ఆ అచారానికి అంత ముంటే నా ! పది నిమిషాల్లో తెంటి పెట్టకపో, నీ ప్రాణాలు తోడతా నీవేళ ! దొంగతనానికి, వాడి బటానీలకి ఆచారం లేదు. దీనికి గిన్నెల దగ్గిరా, పీడదగ్గిరా అంటుకుంటుంది.

విశ్వనాథం ఆలోచిస్తున్నాడు. రెండు నిమిషాలు పూర్తాదరు.

విశ్వ : ఏమిట్రా ఆలోచిస్తున్నావు? ఏమిటి! శీతయ్య యిట్లా మారాడేమా అనుకుంటున్నావు. అవునా ! ఆడది అంటే అట్లా పూజించేవాడు, మీటింగుల్లో స్త్రీ హక్కులను గురించి కాలేజి హాలు మొగర గొట్టిన శీతయ్యేనా ! ఏంచెయ్యనురా. నా ఖర్మం. మన ఉద్దేశ్యాలకూ పనులకూ అంత వ్యత్యాసముంది. ఏం, మాట్లాడవేం ?

విశ్వ : వుండు. నాకు నువ్వు కావలసిన వాడివి. కాకపోతే నేను జోక్యం కలగ జేసుకుంటానా ? నాకేం పట్టిం దని వూరు విడిచి పోతాను. ఇదే మొదటిసారి, ఇదే ఆఖరు సారి యీా విషయమై నీతో మాట్లాడ్డం. ఎందుకు అట్లా కొడతావు ?

శీత : నాకు కొట్టడం సరదా అనుకున్నావా? భార్యని కొట్టడం ధర్మమనుకునే వాణ్ణి కాదుకద! కాని ఏం చెయ్యను కొట్టక! ఇంక గతిలేక నన్ను నేను ద్వేషించుకుంటూ కొడతాను. ఈ ఆరేళ్ళ నుట్టి నేను పడుతున్న వేదన——రెండు రోజులు చూస్తే నీకు భయంకరంగా వుంటుంది. నేను పరమ రాకాసి వలె కనపడతాను.

విశ్వ : తారతమ్యాలకేం, వుంటాయి. కాని కొట్టడ మేమిటి?

శీత : కొట్టకండా ఉంచగలవా దాన్ని! దాని సంగతి తెలీదు నీకు. బ్రహ్మదేముడి తరంగాదు. ఇన్ని లెన్నాళు తిన్నా—— ఈ ఆరేళ్ళ నుట్టి ఎన్ని దెబ్బలు తిందో—— దేవుడికే తెలియాలి. కాని ఒక్క గడియ కాపరం సాగాలంటే,—— చూస్తున్నావుగా?

విశ్వ : ఈ దెబ్బల వల్లనేమో బుద్ధి రాకపోవటం——

శీత : బాగా వుంది. దాని బుద్ధి పుట్టకతోనే అంత—— వొచ్చిన రోజునించి ఇంతే——

విశ్వ : మరి కొట్టి ఏం లాభం?

శీత : తాత్కాలికంగా దారికొస్తుంది.

విశ్వ : యేమైనా నిస్తుంది. నీచేతుల తీట వొదులుతుంది.

శీత : అవమానం సహించలేక పోతే మితి మీరుతున్నది. నేను ఇన్ని బాధలా చూడలేదనా——

విశ్వ : పుట్టింటికి పంపరాదూ?

శీత : అదీ—— సంతోషంగా పంపుతాను. కాని ఏమవుతుంది పాపం—— వాళ్ళెట్లా చూస్తారు దాన్ని—— నా

కెవరు పిల్లనిస్తారు ? అన్నీ యోచించు— దాన్నడుగు— దెబ్బలు తింటావా, పుట్టింటికి పోతావా అని— నేనూ ఎన్ని విధాల చూశానని ! నీకేం, చెపుతావు ? నాకు జడ్జీగారి కూతురు ర్నివ్వలేదుగా ?

విశ్వ : యెవరి కూతురైతేనేం ?

శీత : అట్లా అనకు. సంప్రదాయం అనడంలో లక్ష అర్థముంది. కాని ఇది మంచి కుటుంబం పిల్లే ! కాని లక్షణా లిట్లా వున్నాయి. ఇంతకీ గీత !

విశ్వ : గీత కాదు. మనం చేసుకున్నదే ! అంతా మనకి అర్థంకానిదల్లా గీత !

శీత : అట్లా అనకు— ఈమూడు రోజుల్నించీ చూస్తున్నావుగా ! నీ పెళ్ళామే యిట్లా చేసిందనుకో. ఏం చేస్తావు ? మాట్లాడవు. ఆదొంగ బుద్ధేమిటి ? దాని కేంతక్కువ చేశాను ? ఆ బటానీలవాని దగ్గరా ! వాడు తిట్టడమూ ? చెయ్యిపుచ్చుకు లాగడమూ ? గీతకాక యింకేమిటి ? మాట్లాడు.

విశ్వ : నేనేం చెప్పను ?

శీత : మరి దానివేపు వకాల్తా పుచ్చుకున్నావుగా !

విశ్వ : ఆమెవేపు కాదు— నీవేపు— నువ్వు, నీవంటివాడు, భార్యని కొట్టేటంత పాడుపని చేస్తావుంటే, చూడలేక—

శీత : మాకేం చెయ్యను ?— తెలుసుకుంటే వంచేస్తారు ! చంపుతారా తేకా—!

విశ్వ : యెవర్ని ?

శీత : తెలుని -యేం చెయ్యమంటావు ? అమ్మా, తల్లీ, మంచిపని చేశావని పూజించనా ? నాకు పరువు వుండాలా ? నా సంసారం గడవాలా ?

విశ్వ : ఓసే బటానీలు కొనుక్కోడానికి నీ భార్యకి డబ్బులు యిచ్చావా ? లేదు. బియ్యమన్నా దొరక్కుండా దాస్తివి కదా, మరి దొంగతనం చెయ్యకండా చావమంటావా ?

త : బటానీలు కొనవలసిన పనేమిటి ?

విశ్వ : తినడానికి ?

శీత తినకపోతేనేం ? చస్తుందా ?

విశ్వ : నువ్వు తినేవన్నీ ?

శీత : దొంగతనం చేశా !

విశ్వ : మరి వేరుగతి యేదీ ?

శీత : బియ్యమిస్తే సాయింత్రానికి మిగులుతాయా!

విశ్వ : యేం చేస్తుంది ?

శీత : యిట్లానే కొనేస్తుంది.

విశ్వ : దొంగతనం చెయ్యదుగా!

శీత : చెయ్యకేం! అప్పుడూ చేస్తుంది.

విశ్వ : అవసరమేదీ ?

శీత : నువ్వనేది — దాని యిష్టమొచ్చినవన్నీ కొనడానికి, బస్తాబియ్యం పడెయ్యమంటావా ? సంసారమూ —

విశ్వ : ఎన్ని బస్తాల బటానీలు తింటుంది !— కరువా —

శీత : ఒక బటానీలేమిటి ? పకోడీలు - గారెలు - దోవన పోయినవన్నీ——

విశ్వ : నీవైతే మాత్రం ఎన్ని తింటుంది ? నీ సిగరెట్ల ఖర్చు కన్న యెక్కువవుతుందా ?

శీత : అసలా తిండిమీద ఆ పాడు రంధి యేమిటి ?

విశ్వ : మరి మనిషైన తరవాత -

శీత : బటానీలమీదా ? నీకూనాకూ పుట్టదేరా.

విశ్వ : బటానీలమీద మనకి రంధివున్న రోజులు, కానులు దొంగిలించిన రోజులు-

శీత : చిన్నతనం-

విశ్వ : ఇంకా ఆమె ఆస్థితిలోనే వుంది.

శీత : ఇన్నేళ్ళొచ్చి-

విశ్వ : ఏళ్ళుకాదు - మనకున్న అనుభవం - మన విద్యా సంస్కారం లేకపోబట్టి-

శీత : ఆ తిండి-ఆ ఆకలి-

విశ్వ : పొద్దున్నే మనమేం తిన్నాము ? ఎక్కడ ?

శీత : కాఫీహోటల్లో యిడ్లీ-

విశ్వ : పుష్కం, అట్లు - మతివుందా ? ఆమో ? మనం మధ్యాన్నం టిఫిన్-ఆమో ? నీకు మతివుందా ? ఎవ రన్నా ఇంత తింటున్నావేమిటి అని అడిగేవా రున్నారా ? బటానీలు తిన్నా అడిగేవారున్నారా ? పొద్దున్న తన చేత్తో వొండి - ఆకలికి మాడుతో ఆ పదార్థాల యెదురుగా - మనం వొచ్చిందాకా -

య్యడ్లీ, అట్లూ తిన్న మనం రావడం – రెండు ఝూమువైనా కూచోవాలి, మరి బటానీలు తినక యేం చేస్తుందిరా? పోనీ, ఆ భోజనం నువ్వూ, నేను, యింకా స్నేహితులు, అందరమూ తినగా – యేమన్నా మిగిలితే – ఆకూర–ఆపులుసు బాగుంటే మనమే మారు వొడ్డించుకొని తినేస్తాం. బాగాలేక పోతే ఆమెకి వొదులుతాం, తిట్లుతిట్టి ఆమె మొహాన పారేస్తాం, ఆమె చేత్తో చేసినకూర–అవునా?

శీత : ఐతే, నేను సంపాయించుకున్నాను. ఆడదానికికూడా కాఫీహోటళ్ళా! మంచివాడవే! నీనంటివాళ్ళుండ బట్టే యిట్లా నెత్తి నెక్కుతున్నారు.

విశ్వ : మరి ఆమెని సంపాయించుకోనిస్తావా?

శీత : దానికేం చాతనవును!

విశ్వ : అదే, చాతకాకండా చేసి–ఏం? ప్రతి తెలివితక్కువ మొగవాడూ సంపాయించుకోటం లేదూ! పోనీ, యెక్కడన్నా వంట చేసుకోమంటావా? నీయింటో వంటచేస్తే, తిండిపెట్టడం గగనం, ఇంకోళ్ళయింటో వంటచేస్తే, తిండిపెట్టి, పదిరూపాయలు చిరుతిండి కిస్తారు–ఈ దెబ్బలులేవు.

శీత : నా పెళ్ళాన్ని వంటకి పెడతావు?

విశ్వ : మరి నగలమ్ముకోనిస్తావా?

శీత : నగలకి! ఏం? అంతకన్న బావుంది.

విశ్వ : నువ్వివవు? సంపాయించుకోనీవు. ఎలా?

శీత : ఎలా ఏమిట్రా?

విశ్వ: ఓసే, నీవంటి మనిషేనా, ఆమె? నీకు నాటకాల మీదా, సిగరెట్లమీదా యిష్టమైతే, ఆమెకి వేరు శనగలమీద యిష్టం! నీకూ తగాదా ఎందుకు? మరి నీబోటిదే కదా, మరి నువ్వు రోజుకి అర్ధ రూపాయి తగలేస్తావే, దాంట్లో నాలుగణాలు ఆమె కియ్య తగలెయ్యడానికి! ప్రేమతో దయతో నువ్వు చూస్తావని, వేరే జీవితం, సంపాదనా వొదులుకొని నమ్మి వొచ్చిందే ఆడది- పవిత్రమైన మంత్రాలతో పెళ్ళిచేసుకుంటివే - స్త్రీ స్వాతంత్ర్యం మాట్లాడిన వాడివే! నా పెళ్ళాం- నా పెళ్ళాం అంటావు. ఎందుకు -- దెబ్బలు తినేందుకా? కానీ బటానీలుకొనుక్కునే గతిలేదు, వొరే-కాఫీహోటల్లో యిడ్లెన్లు తేవడం- అర నిమిషం ఆలస్యమైతే-విస్తట్లో పప్పువడ్డించడం కొంచెం తాత్సారమైతే మండిపడతావే-- ఆడదానిది నీ వంటి పొట్టకాదూ! దొంగతనం చేసిందంటావా? అంత ఆలస్యమైతే నువ్వెన్ని హత్యలు చేస్తావో? రాత్రులు నీరొమ్ముకి అంత దగ్గిర చేర్చుకుంటావే, మళ్ళీ ఆదయంతా యే మవుతుంది? అంత మాత్రం ఆమె బాధను అర్థంచేసుకోలేక పోతే-స్త్రీలకే తెలీదు వాళ్ళ బాధలేవో, మగవాళ్ళకి విప్పి చెప్పలేరు. వాళ్ళకే తెలీదు. ఈబటానీల మీద తనకీ కోర్కె యేమో అని ఆమె తనని తానే తిట్టుకుంటూ వుంటుంది. నువ్వు మాత్రం కాలుమీద కాలు వేసుకుని —'నాకు ఆవడ లిష్టం రెండణాలవి తీసుకురా' అంటావు.

శీత : ఒక్క తిండేనా ? దొంగతనం— అబద్ధాలు—

విశ్వ : దెబ్బవల్ల మొన్ని సుర్గుణాలు పుడతా యంటావు—
భయంవల్ల పిరికి తనం— దానివలన—

శీత : మరి యీా వితంతువు లందరు యిట్లానే తింటు
న్నారా ?

విశ్వ : ఆ వితంతువు లుండే వాళ్ళ ఆకలిని మరిపించేవి—
అనేక నిబంధన లున్నాయి— మరి ఆ ఆచారాలన్నీ,
ఆపూజలన్నీ నేమిటి ? ఆకలినీ, కామాన్నీ, మరి
పించడానికి కాకపోతే. మరి ఆచారాలంటే నువ్వే
మండి పడితివి, వెక్కిరిస్తివి, ధ్వంసం చేస్తివి.
మళ్ళీ అదంతామూర్ఖం, పూర్వాచారం— వితంతువు
వలె ఆకలి మాత్రం మరవాలి. ఆరెండో విషయం
కూడా యింతే—

(చిన్నమ్మ వొచ్చింది)

చిన్న : కాళ్ళు కడుక్కోండి.

శీత : మరి...

విశ్వ : అదుగో మరి భోజనానికి ఆలస్యం చెయ్యకు. పోనీ
ఆమెను తినమను—

శీత : పద, పద, కాళ్ళు కడుక్కో.

---

# ఇన్ జక్షన్

| | | |
|---|---|---|
| సుభద్ర | — | నాయిక |
| లక్ష్మమ్మ | — | తల్లి |
| దీక్షితులు | — | తండ్రి |
| మధుసూదనరావు | — | భర్త |
| కుమారస్వామి | — | బంధువు |
| గౌరమ్మ | — | పనిమనిషి |
| డాక్టరు | — | |

## ఒకటో రంగం

సుభద్ర: అమ్మా! కాళ్ళు చేతులు లాగుతున్నాయి.

గౌరమ్మ: మరి ధారకం చేయిస్తారు?

లక్ష్మమ్మ: అదేదో అర్లిక్సు ఏమిటో పొయ్యమన్నాడుగా డాక్టరు! నిన్నుండీ పట్టుకొచ్చారే కాదూ?

దీక్షితులు: ఆ ఆర్లిక్సు గోడు ఎందుకంట? ఆవుపాలకంటె శ్రేష్ఠమైన పత్యముందా!

కుమారస్వామి: అదేదో ఆ పొడుం గుణమేమిటో తెలుసుకోకుండా డాక్టరుకంటె యెక్కువ తెలిసినట్లు ఆవు పాలు శ్రేష్ఠ మంటావేమిటయ్యా?

లక్ష్మి: అప్పుడే అడిగాను ఆవుపాలు పొయ్యవొచ్చా అని. సుతారామూ వల్లకాదన్నాడు.

సుభ: అమ్మా! నాలిక యెగిరిపోతూంది.

లక్ష్మి: వెళ్ళకండి.

డాక్ట : నే నెందుకు? ఇంటికెళతాను.

సుభ : డాక్టరుగారూ? వస్తున్నాను.

డాక్ట : పాపం కళ్లుతిరుగుతున్నాయి ఏమయినా పొయ్యండి. చచ్చిపోతుంది మీరిట్లాచేస్తే.

లక్ష్మి: ఎవరు తాకుతారు?

డాక్ట : ఇంక యీ మూడురోజులూ యింతే?

గౌర : మీరందరు బైటికి పొండి— నేను గుడ్డ విప్పేసుకుని పోస్తాను.

డాక్ట : నన్ను పరీక్ష చేయనీండి?

లక్ష్మి: వీల్లేదు.

దీక్షి : వుండు—డాక్టరుకేమిటి?

డాక్టరు పరీక్ష చేస్తున్నాడు.

డాక్ట : త్వరగా పాలివ్వండీ, తొరగా— నాడి లాక్కు-పోతూంది....

లక్ష్మి: పాలు లేవు.

డాక్ట : తేనె...నీళ్ళు...ఏవో వొకటి (లక్ష్మమ్మ తెచ్చింది) పొయ్యండి...

లక్ష్మి: నేనెట్లా తాకుతా?

గౌర : తాకారుగా మీరే పొయ్యండి.

డాక్ట : (పోస్తే) రోగులకి ఆచారం కూడా వెడుతో కూచుంటే నేనేం పనిచేస్తాను? తాగమ్మా తాగు. చంపేశారండి బిడ్డని, లాభంలేదు.

సంచి తెరచాడు.

దీక్షి : ఏమిటండీ !

డాక్ట : ఉండండి మాట్లాడించకండి.

దీక్షి : చెప్పండి.

డాక్ట : ఇంజక్షను.

దీనికీ పైగా చార్జీ చేస్తారా ?

డాక్ట : ఆ, ఆరురూపాయలు.

దీక్షి : వొద్దులెండి.

డాక్ట : ప్రాణం పోతూందయ్యా !

దీక్షి : పోయే ప్రాణాన్ని యీ మందుతో ఆపుతారా ? యీమందు లేకనేనా యిన్ని ప్రాణాలు పోయినాయి?

నవ్వుతున్నాడు.

డాక్ట : ఇట్లా పుచ్చుకోండి.

శార : ఆ ! నన్ను తాకకండి.

దీక్షి : వొద్దు. ఆ ఇంజక్షను మా అమ్మాయికి వొద్దు.

కర్రతో లాగెయ్య బోతున్నాడు.

డాక్ట : ప్రాణం పోతోందయ్యా !

దీక్షి : యీ మాటలకేం లెండి.

డాక్ట : మీరేం చార్జీ యివ్వొద్దు. అడ్డంరాకండి.

దీక్షి : మీ అంత ఉదారుణ్ణి చూడలేదండి. మావంటి బీద వాళ్ళకి మీ రండ బట్టి గాని...

డాక్ట : ఇట్లా పట్టుకోండి.

దీక్షి : తెండి, తెండి, ఈ ఇన్ జక్షన్లలో కొన్ని చాలా బాగా పనిచేస్తాయి.

గౌర : యేమీ అపాయం లేదు కదా ?

డాక్ట : పట్టుకోండి.

గౌర : వొద్దు, వొద్దు. నేను తాకను.

డాక్ట : బాగానే వుంది.

ఇన్ జక్షను యిస్తున్నాడు.

దీక్షి : ఏం బాగా పని చేస్తాయండి ఈ యింగ్లీషు మందులు! మళ్ళీ బహుచవుక.

సుభ : అమ్మా !

కన్ను తెరచింది.

డాక్ట : కాఫీ యివ్వండి.

లక్ష్మి: తెప్పించానండి... హోటల్నించి.

దీక్షి : డబ్బెక్కడిది ? ఎవర్నడిగావు?

లక్ష్మి: వుందండి.

డాక్ట : పొయ్యండి.

గౌర : కొంచెం పోసి పోండి.

డాక్ట : ఏం చెయ్యను, తెండి (కాఫీ పోస్తున్నాడు.) ఇదుగో మూడో రోజు స్నానం చేయిస్తారేమో ! చేయించారా బతకదింక. మీ యిష్టం.

లక్ష్మి: చేయించక యెట్లా ?

డాక్ట: నాకు తెలియదు.

లక్షేమయింది ? సబ్బుఖర్చు, అసలు సబ్బు లేదను కుంటాను. లేదు కదు టే ?

గౌర : చేతులేమిటి ? స్నానం చెయ్యాలి. భావిదగ్గరకు పోయి రెండుచాదలు తోడుకు పోసుకోండి.

డాక్ట : మీా భావి మైల చేయడమెందుకు ? సరాసరి వూరి బైట చెరువుకుపోయి మునుగుతాను—— ఈనూటుతో కూడా.

లక్ష్మమ్మ నీళ్ళు దూరంగా పెట్టింది, తువ్వాల విసిరి వేసింది.

---

# రెండో రంగం

మధుసూదనరావు, డాక్టరు జార్జి కలుసుకున్నారు.

మధుసూదనరావు: హాల్లో ! డాక్టరు జార్జి !

జార్జి : ఏమిటి నువ్విక్కడికి కొచ్చావు ?

మధు: నాభార్యకి చాలా జబ్బుగా వుంది. అన్నట్టు... జార్జీ ! నువ్వు మాఆవిడ నొకసారి చూడాలి.

జార్జి : ఏం జబ్బు ?

మధు: క్షయ అన్నారు.

జార్జి : అయితే యిట్లాంటి సందుల్లో వుంటారేం ?

మధు: ఏం చెయ్యమంటావు ? ఆ ముసలివాళ్ళు వినరు.

జా : వినకపోతే నువ్వు వినేటట్టు చెయ్యాలి. నీ భార్య ప్రాణ మెక్కువా ? ముసలివాళ్ళ ఆచారమా ?

మధు: బాబూ! ఆ ఆచారాలతో చచ్చిపోతున్నాము. యెవరూ కుమ్మక్కులేక వొక్కణ్ణీ లొంగిపోయాను.

జా : పద చూతాం.

---

## మూడో రంగం

గౌర : ప్రొద్దెక్కుతూంది, కానీండి! దాని యేడుపులకి దడిశి వూరుకుంటా రేమిటి ?

సుభ : వొద్దు రా! నాకిప్పుడే వొణుకు పుడుతూంది. మీ గాళ్ళు పట్టుకుంటా. కూచోలేను.

లక్ష్మి: డాక్టర్ల మాటకేమిటి ? వాళ్లు అట్లానే అంటారు. నీళ్లుపోస్తే ఒబ్బట ... కానీండి తీసుకు పదండి.

సుభద్రను లేవదీస్తున్నారు. మధుసూదనరావు, డాక్టరు జార్జి వొచ్చారు.

మధు: ఏమిటి ? దాన్ని యెక్కడికి తీసుకు పోతున్నారు ?

యెవరూ మాటాడరు. అడ్డమెళ్ళాడు.

మధు: చెప్పండి, దాన్ని ఏంచేస్తారు?

లక్ష్మి: ఏం చేస్తారూ ? స్నానం చేయిస్తారు.

మధు: వీల్లేదు. స్నానం చేయిస్తే యింక నాకు దక్కదు.

లక్ష్మి: నీకు పెళ్ళాం పోతే పెళ్ళామొస్తుంది, నాకు కూతురొస్తుందా?

జార్జి: మళ్ళీ కంటారు.

గౌర: ఎవడు వీడు? ఛీ, ఛీ. వాణ్ని యింటోకి రానిచ్చారేం? పో, బైటికి పో.

మధు: సరేలే, ముందు దాన్ని స్నానం చేయించడమేమిటి అది చెప్పండి?

గౌర: గదిలోకూడా పనికి రానివాడు డాక్టరు. రేగిచెట్టు క్రింద చేయిస్తాను, మండిపడని. రేగిఆకు రోగాన్ని రానీదు.

మధు: ఏం డాక్టర్?

జార్జి: ఏముందీ? మీ ఆచారాలు కట్టిపెట్టండి. స్నానం చేయించనీము.

గౌర: చేయించనీవ్వరా? బైటికి నడు ముందు. వీడట డాక్టరట. వీడి మొహాన్ని... ...

జా: పిల్లేదు.

లక్ష్మి: పిల్లేమూ? మాల వెధవా! ఇంట్లో కెందుకు వచ్చావు, పో.

జా: నేను వెళ్ళను. నా స్నేహితుడికోసం వొచ్చాను.

గౌర: ఇద్దరూ వెళ్ళండి.

జా: వెళ్ళం.

గౌర: యెట్లా వెళ్ళరో చూద్దాం పదవే! వోదినా!

లక్ష్మమ్మ చెంబుతో వేడినీళ్ళు, గౌరమ్మ కర్రా పట్టుకొచ్చారు.

గౌర : పదండి

లక్ష్మ: ఇంక నడవండి.

నీళ్ళు చల్లుతున్నారు.

జా : నాసూటు తడిసిపోయింది.

జార్జి పరుగెత్తుతున్నాడు.

జా : మధూ ! గుడ్ బై !

గౌర : అమ్మ ! యింక పోయినారా ! దీన్ని తీసుకురా.

సుభ : చచ్చిపోతానే... నాకునీళ్ళవొద్దే. ఇవాళేనయంగా వుంది నన్నెందుకు చంపుతావే.

లక్ష్మ: ఎవరూ చంపరు. వాళ్ళ మాటలు విని నీకూ పుట్టింది. ముట్టునీళ్ళు పోసుకున్న వారందరూ చస్తున్నారా ? అంతావేషం పద.

సుభ : నాబాబుని వొక్కసారి చూడనీ. (చంటి పిల్లని తీసి చూచుకొని) బాబూ ! నేను చచ్చిపోతాను. అమ్మకోసం యేడుస్తావా ?

గౌర : నోరుముయ్యి. మదీవొచ్చింది.

---

నాలుగో రగం

కుమా: చేయించారూ స్నానం, చేయించారూ ?

గౌర : అమ్మో ! మా అమ్మో ! ఇంకేముంది మా అమ్మ !

కుమా: యేమని చేయించారు ?

లక్ష్మ: స్నానం కాదురా ! ఆడాక్టరు ఇన్ జక్షను యింతా

చేసిందిరా! అప్పుడే అన్నా ఆపాడు పాడపటాలు కొంపలు తీస్తాయని.

గౌర: ఏడీ! ఆ డాక్టరు యింకా వొచ్చావడేం!

లక్ష్మి: వాడికేం! ఆకాస్త విషయం ఎక్కించాడు, తక్కిన వాళ్ళకి యెక్కించాలని తొరతొరగా పోయినాడు.

కుమా: అమ్మా! సుభద్రా యెట్లావున్నదమ్మా!

గౌర: ఇంకేం సుభద్రరా!

డాక్టరూ దీక్షితులూ వొస్తారు.

డాక్ట: చెప్పినంత పని చేశారు! కావలసిందే శాస్తి.

లక్ష్మి: మాకేంశాస్తి నాయనా! మాగీత యిట్లారాసివుంటే! ఏ లగ్నాన పెళ్ళిచేశామో గాని...

దీక్షి: అయ్యా! డాక్టరు గారూ! ఇది కోపాలకు సమయం కాదు. ఏదో మూర్ఖపు ముండలు ఇట్లా చేశారు.

డాక్టరు చూస్తున్నాడు.

లక్ష్మి: మొన్న అమ్మాయిని తాకిన బట్టలు కావుకద!

దీక్షి: నోరుముయ్యి మాట్లాడావంటే తంతా.

లక్ష్మి: తంతావూ! తంతావూ!

డాక్టరు ఇంజక్షను నిస్తున్నాడు.

గౌర: దీని ప్రాణం యెప్పుడో పోయింది.

సుభద్ర కళ్ళు తెరిచింది.

డాక్ట: యెట్లావుంది?

సుభ : కాఫీ కావాలి.

డాక్ట : ఇయ్యండి.

త్రాగుతూంది.

డాక్ట : బాగావుందా ?

సుభ : ఆ.

డాక్ట : ఈవాళంతా... మీతో చెప్పితే ఏంలాభం ? మీ యిష్టమొచ్చినట్లు చెయ్యండి. బాగా పప్పూ పెరుగూ ఆవకాయ అన్నీ వేసి అన్నం పెట్టండి... ప్రాణం పోతూవుంటే నన్ను పిలవండి.

గౌర : ఏమండీ ! డాక్టరుగారూ ! స్నానం చేయిస్తే చస్తుం దంటిరే ? బాగానే బతికించే !

డాక్టరు వెళ్ళాడు.

లక్ష్మి: యెట్లా వుందమ్మా !

సుభ : నీరసంగా వుంది.

దీక్షి : ఆ డాక్టరు ఆపాడు మందులు యెక్కించాడు కాదూ, అందుకని....

కుమా: పైగా నీరసానికి డాక్టరు కారణం... నువ్వూ అట్లానే అంటావా దీక్షితులూ !

దీక్షి : ఏమోలే ! యిప్పటికి నయమైనట్లు వున్నా మనిషి వాళ్ళు గుల్లచేస్తాయి.

లక్ష్మి: ఈ చిన్నపిల్లల పెళ్ళిళ్ళు మానమనక పోతే యీ డాక్టర్లని యీ సూదుల్తో పొడవ కుండా చెయ్య కూడదూ గవర్నమెంటువారు !

మధుసూదనరావు తిరిగిచూస్తున్నాడు.

గౌర : ఆ మాల వెధవ ! వాడు వొదిలాడా ? మళ్ళీ వచ్చాడా ?

( తెర )

